# హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?

సనాతనమైనది ఇందూ ధర్మము
శాశ్వితమైనది ఇందూ ధర్మము
దేవుడు ధర్మములను రక్షిస్తాడు
మనిషి ధర్మములను ఆచరిస్తాడు

రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# హిందూ ధర్మమునకు
# రక్షణ అవసరమా?


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, 94 వ గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–39 ప్రథమ ముద్రణ : జనవరి–2018

ప్రతులు : 1000 **వెల : 75 /-**

"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మములో రక్షణ అవసరమా?
95) మనిషికి వేదము అవసరమా?
96) మానవత్వము.
97) సుప్రసిద్ధి బోధ.
98) రూపము మారిన గీత.
99) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
100) రాజకీయము×రాజకీయము.
101) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.

80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మావిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా
08



### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

---

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?

నేను ఒక మనిషిని, నేను ఏ మతమునకు సంబంధము లేనివాడను. పరమాత్మయిన దేవుని వలన ప్రపంచము పుట్టినది. ప్రపంచములో ఆత్మయను దేవుని వలన మనుషులు, జీవరాసులు సృష్ఠింపబడినారు. పంచ మహా భూతములయిన ప్రపంచమును సృష్ఠించినవాడు ఒకటవ దేవుడు. ప్రకృతిని సృష్ఠించినవాడు **ఒక్క దేవుడే.** అప్పుడు రెండవవాడు ఎవడూ లేడు. ఒక పురుషుడే స్త్రీ తత్త్వమైన పంచభూతముల ప్రపంచమును సృష్ఠించాడు. తర్వాత ఖాళీగాయున్న ప్రపంచములో జీవరాసులు లేవు, మనుషులు లేరు. అప్పుడు మొదటి సృష్ఠికర్తయిన ఏకైక దేవుడు రెండవ పురుషున్ని పుట్టించాడు. రెండవ పురుషున్ని సృష్ఠించినవాడు మొదటి పురుషుడు. మొదటి పురుషుడు తెలియబడనివాడు అయినందున ఆయనను **'దేవుడు'** అని అన్నారు. స్త్రీతత్త్వమైన ప్రకృతిని సృష్ఠించిన సృష్ఠికర్తను **'దేవుడు'** అని అనుచున్నాము.

సృష్ఠింపబడిన ప్రకృతిని సృష్ఠికర్తయిన దేవుడు రెండు భాగములుగా విభజించాడు. అందులో ఒక దానిని మార్పు చెందని ప్రకృతియని అంటున్నాము. మరియొక దానిని మార్పు చెందే ప్రకృతియని అంటున్నాము. ప్రపంచమును సృష్ఠించిన సృష్ఠికర్తయిన పరమాత్మ ప్రపంచములో మనుషులను, జీవరాసులను తయారు చేయదలచి జీవరాసులను సృష్ఠించుటకు మరియొక పురుషున్ని తయారు చేశాడు. ఆ రెండవ పురుషున్నే **'ఆత్మ'** యంటున్నాము. సృష్ఠికర్తయినవానిని దేవుడు అని అన్నాము కదా! అదే విధముగా జీవరాసులను సృష్ఠించిన సృష్ఠికర్తను కూడా దేవుడేయని అంటున్నాము. ఆ విధముగా మొదటి దేవుడు, రెండవ దేవుడు అని ఇద్దరు దేవుళ్లు తయారయినారు. రెండవ దేవుడు కూడా సృష్ఠింపబడిన వాడే కావున సృష్ఠింపబడిన వానికి పేరున్నది. సృష్ఠింపబడినది ఏదయినా

దానికి పేరు, రూపము, పని ఉంటుంది. **తయారు చేయబడిన దేనికయినా ఒక శాస్త్రీయత కలదు. శాస్త్రీయతను అనుసరించి దానికి సిద్ధాంతమున్నది. సిద్ధాంతమున్న దానికి నిర్ణయించబడిన ధర్మముండును.**

సృష్ఠింపబడిన ప్రతీ దానికి ధర్మమును నిర్ణయించినవాడు మొదటి దేవుడయిన పరమాత్మ. మొదటి సృష్ఠికర్తయిన దేవుడు ఎవరి చేతా సృష్ఠింప బడలేదు. అందువలన ఆయనకు పేరు లేదు, ఆకారము లేదు, పనియూ లేదు, ఆయనకు ఏ ధర్మములు లేవు. తన నుండి రెండవ ఆత్మను సృష్ఠించిన మొదటి దేవుడు ఆత్మకంటే వేరుగా యుండువాడయిన దానివలన, ఆయనను గుర్తింపు కొరకు, ఆత్మకంటే వేరయినవాడను అర్థము వచ్చునట్లు 'పరమాత్మ' యని అనడమైనది. సృష్ఠికి పూర్వము సృష్ఠికర్తయిన వానికి పరమాత్మయను గుర్తింపు కూడా లేదు. ఏ గుర్తింపు లేనివాడయిన మొదటి దేవుడు, మొదటి సృష్ఠికర్త, ధర్మములు లేనివాడు. ఆయన ఎవరి చేతా సృష్ఠింపబడని వాడైనందున ఆయన **ధర్మాతీతుడు.** ధర్మములకు అతీతుడుగా యున్న మొదటి దేవుడయిన **పరమాత్మ** తన తలంపు చేత ఆత్మను సృష్ఠించాడు. ప్రపంచములో ఆత్మకు ధర్మములు గలవు గానీ, సృష్ఠింపబడని పరమాత్మకు ధర్మములు లేవు. పరమాత్మ చేత సృష్ఠింపబడినవాడు ఆత్మ. ఆత్మ ధర్మయుక్తుడైయుండి తాను జీవరాసులను సృష్ఠించడము జరిగినది. సృష్ఠి తర్వాత ప్రపంచములో మొదట పని చేసినవాడు **ఆత్మయే.** ఆత్మ జీవరాసులను సృష్ఠించాడు. సృష్ఠించువాడు అయినందున ఆత్మను **'రెండవ దేవుడు'** అని అంటున్నాము.

ఆత్మ రెండవ పురుషుడై, మూడవ పురుషుడయిన జీవాత్మను సృష్ఠించాడు. జీవాత్మ పురుషుని అంశయే అయినా, అతను ప్రకృతితో కలిసి యున్నాడు. జీవుడు ఆత్మవలె పురుషుడైయున్నాడు. జీవుడు ఆత్మ చేత సృష్ఠింపబడినాడు. కావున సృష్ఠింపబడిన వానికి ధర్మములు ఉండును.

జీవాత్మ ధర్మములు వేరు, ఆత్మ ధర్మములు వేరు. సృష్టింపబడిన దేనికయినా రూపము, పేరు, క్రియలు ఉంటాయని చెప్పినట్లు ఆత్మకు రూప, నామ, క్రియలు గలవు. అట్లే జీవాత్మకు కూడా రూప, నామ, క్రియలు గలవు. ఆత్మను ప్రకృతి ఆవహించి లేదు. అందువలన ఆత్మలో పురుషతత్త్వమే యున్నది గానీ, స్త్రీ లక్ష్యణములయిన ప్రకృతి లక్ష్యణములు ఏవీ లేవు. అయితే మూడవ ఆత్మయిన జీవాత్మ పురుషుడే అయినా, స్త్రీతత్త్వమైన ప్రకృతి వేషమును ధరించియున్నాడు. పురుషుడు కనిపించే స్త్రీ దుస్తులు ధరించడము వలన జీవున్ని పూర్తి పురుషుడు అని అనక నపుంసకుడు అని చెప్పవలసి వచ్చినది. ప్రకృతి లేకముందు ప్రకృతిని సృష్టించిన దేవునికి సృష్టి తర్వాత ఏ కార్యమును చేయక, తాను తయారు చేసిన ఆత్మకు జీవరాసులను తయారు చేయు కార్యమును నియమించాడు. దేవుడు తనను సృష్టించాడు కనుక ఆయన ఆజ్ఞ ప్రకారము, ఆయన ఇచ్చిన అధికారము ప్రకారము ఆత్మ అనబడు రెండవ దేవుడు సర్వజీవరాసులను మార్పుచెందే ప్రకృతితో కలిపి తయారు చేశాడు.

సృష్టించేవాడు అయినందున ఆయనను (ఆత్మను) కూడా దేవుడు యనియే పిలుస్తున్నాము. అయితే 'సృష్టింపబడిన వానికి ధర్మములుంటాయి' అను సిద్ధాంతము ప్రకారము ఆత్మకు రూప, నామ, క్రియలున్నాయి. అట్లే సృష్టింపబడిన **జీవాత్మకు కూడా రూప, నామ, క్రియలు** గలవు. అంతేకాక **'చావు, పుట్టుకలు'** అను ధర్మములను కూడా కలిగియున్నాడు. స్త్రీతత్త్వ మయిన ప్రకృతిని మొదటి సృష్టికర్త అయినవాడు మార్పుచెందే ప్రకృతి, మార్పు చెందని ప్రకృతియని రెండు భాగములుగా తయారు చేశాడు. ప్రకృతి కూడా సృష్టింపబడినదే కావున, ప్రకృతి కూడా ధర్మములతో కూడుకొని యున్నది. ధర్మములు సిద్ధాంతము మీద, సిద్ధాంతము శాస్త్రము మీద ఆధారపడి యుంటుంది. అందువలన ఏ ధర్మమయినా శాసనములతో

కూడినదై, మార్పుచెందనిదై ఉంటుంది. పరమాత్మ సృష్ఠింపబడనివాడు అయినందున ఆయన ధర్మములకు అతీతుడు.

ఈ విధముగా సృష్ఠింపబడినవారు ముగ్గురు ఒకటి ప్రకృతి, రెండు ఆత్మ, మూడు జీవాత్మ. ఈ ముగ్గురిలో ప్రకృతిని, ఆత్మను సృష్ఠించినవాడు మొదటి సృష్ఠికర్త పరమాత్మ కాగా, జీవాత్మను సృష్ఠించినవాడు రెండవ సృష్ఠికర్త అయిన ఆత్మయని తెలియవలెను.

**1) సృష్ఠికర్తలు ఇద్దరు**
1) పరమాత్మ
2) ఆత్మ

**1) సృష్ఠింపబడినవారు ముగ్గురు**
1) ప్రకృతి
2) ఆత్మ
3) జీవాత్మ

**2) పరమాత్మ సృష్ఠి**
1) ప్రకృతి
2) ఆత్మ

**2) ఆత్మ సృష్ఠి**
1) జీవాత్మ

**3) పురుషులు ఇద్దరు**
1) పరమాత్మ
2) ఆత్మ

**3) పురుషులు కానివారు**
1) ప్రకృతి

**4) పని చేయని పురుషుడు**
పరమాత్మ

**4) నపుంసకుడు**
జీవాత్మ

**5) పని చేయు పురుషుడు**
ఆత్మ

**5) అనుభవించే వాడు**
జీవాత్మ

| | | | |
|---|---|---|---|
| 6) | **ధర్మములు లేనివాడు** | 6) | **ధర్మములున్నవారు** |
| | 1) పరమాత్మ | | 1) ప్రకృతి |
| | | | 2) ఆత్మ |
| | | | 3) జీవాత్మ |
| 7) | **కర్మము లేనివాడు** | 7) | **కర్మలున్నవాడు** |
| | 1) పరమాత్మ | | 1) జీవాత్మ |
| | 2) ఆత్మ | | |
| 8) | **శాసనమైనది** | 8) | **కారణమైనది** |
| | ధర్మము | | కర్మము. |

**ప్రశ్న :-** **మీరు ఇంతకు ముందు చెప్పిన సమాచారములో సృష్ఠికర్తలు ఇద్దరు యనీ, ముగ్గురు సృష్ఠింపబడినవారనీ అందులో ఒకమారు సృష్ఠింప బడిన ఆత్మ, తర్వాత సృష్ఠించబడు స్థోమత కల్గిన ఆత్మ, జీవాత్మలను సృష్ఠించినది. జీవాత్మ పురుషుడే అయినప్పటికీ కొంత పురుష లక్ష్యణములు ఉన్నా, అతడు ప్రకృతితో కూడి మాయలో ఉండుట వలన అతనిని 'నపుంసకుడు' యని అంటున్నారు. అయితే సృష్ఠింపబడి ఆ తర్వాత సృష్ఠికర్తయిన ఆత్మకు ధర్మము కలదన్నారు. కేవలము సృష్ఠింపబడిన జీవాత్మకు కర్మము కలదన్నారు. ముందు చెప్పిన సమాచారము ప్రకారము ప్రకృతి పురుషులు తెలియబడినారు. అయితే ధర్మ, కర్మ అను మాటలు ఇప్పుడు క్రొత్తగా వినిపించుచున్నవి. ధర్మము అనగానేమి? కర్మము అనగానేమి వివరించి చెప్పగలరని అడుగుచున్నాము?**

**జవాబు :-** ధర్మము, కర్మము అను రెండు పదములలో చివరి **'ము'** అను అక్షరము ముగింపు శబ్దముగా యున్నది. అందువలన **ధర్మ, కర్మ** అను

రెండు శబ్దముల అర్థమును మాత్రము తెలియవలసియున్నది. ముఖ్యముగా చెప్పితే **కర్మ** అని అలవాటుగా వ్రాయుచున్న పదమును **ఖర్మ** యని పూర్వము వ్రాసెడివారు. కాలక్రమమున ఎన్నో పదములు మారిపోయినట్లు 'ఖర్మ' అనునది 'కర్మ' అని ప్రస్తుత కాలములో వ్రాయబడుచున్నది. 'ధర్మ' అనునది పూర్వము నుండి నేటి వరకు మారకుండా పలుకబడుచున్నది. ఈ పదములను విడదీసి చెప్పుకొంటే క్రింది విధముగా గలవు.

**ద + మర్మ = ధర్మ అని చెప్పవచ్చును.**

**క + మర్మ = ఖర్మ అని చెప్పవచ్చును.**

'ధర్మము'లో **'ద'** ను ప్రక్కన బెట్టి, **'మర్మ'** అను శబ్దమునకు అర్థము చెప్పుకొంటే రహస్యమైనదియనీ, తెలియనిదియనీ చెప్పవచ్చును. అట్లే ఖర్మములో **'క'** ను ప్రక్కన పెట్టి మిగతా **'మర్మ'** మను శబ్దము కూడా రహస్యమైనదనీ, తెలియనిదనీ అర్థమును ఇచ్చుచున్నది. **'ద'** అనగా మారని దక్షత కలదియనీ, మారని నిర్ణయము గలదియనీ చెప్పుచూ, **'ధర్మము' అనగా రహస్యమైన మారని నిర్ణయము** అని చెప్పవచ్చును. **క** అనగా మారని కారణము కలదియని చెప్పుచూ, **కర్మము అనగా రహస్యమైన మారని కారణము గలది** యని చెప్పవచ్చును. జీవున్ని సృష్టించిన ఆత్మకు ధర్మము కలదు, అనగా రహస్యమైన మార్పుచెందని నియమము గలది ఆత్మయని చెప్పవచ్చును. అలాగే జీవునికి ఖర్మ గలదు. అనగా రహస్యమైన మారని కారణము గలది ఖర్మయని చెప్పవచ్చును. **సృష్ఠింపబడిన జీవుని వెనుక ఖర్మము దాగియున్నది. సృష్ఠించిన ఆత్మ వెనుక ధర్మము దాగియున్నది.** సృష్ఠింపబడిన జీవాత్మకు ఖర్మయున్నప్పుడు ఆత్మ కూడా సృష్ఠింపబడినవాడే కదా! అతనికి కర్మ ఎందుకు లేదు అని కొందరు అడుగవచ్చును? దానికి మా జవాబు ఏమనగా! ఆత్మ సృష్ఠింపబడిన వాడైనా,

తాను జీవరూపమైన **జగతి**ని యంతా సృష్ఠించువాడైయున్నాడు, కావున ఆయనకు కర్మ అనుభవములు లేవు. **సృష్ఠికర్త** అగుట వలన కర్మ అనుభవములు **ఆత్మ**కు లేవుగానీ, ఆయన కూడా పరమాత్మ చేత సృష్ఠింపబడినవాడు అయినందున, జీవునకున్న కర్మ ప్రకారము ఆత్మ పనిచేయవలసి యున్నది. అయితే జీవాత్మ మాత్రము అనుభవించవలసి యున్నది. కర్మముల ప్రకారము పని చేయువాడు ఆత్మయినందున అతనిని సృష్ఠింపబడినవాడు అని చెప్పవచ్చును. జీవాత్మ ఆత్మ సృష్ఠింపబడినవారే గానీ, జీవాత్మ దేనినీ సృష్ఠించలేదు. అందువలన **జీవాత్మ** కర్మలనన్నిటిలోని **అనుభవములను** మాత్రము అనుభవించుచున్నాడు. ఈ విధముగా ధర్మమునకు, ఖర్మమునకు వివరము గలదు. జీవుల సృష్ఠికర్త పరమాత్మ కాదు, కావున పరమాత్మకు ధర్మములే లేవు. అయినా ప్రకృతిని, ధర్మములను సృష్ఠించినందుకు ఆయన (పరమాత్మ), ఆత్మ యొక్క, జీవుని యొక్క ధర్మములను విధి విధానములను తెలుపవలసిన కార్యము గలదు. అందువలన దేవుడయిన పరమాత్మ అప్పుడప్పుడు అవతరించి ఆత్మ ధర్మములను చెప్పిపోవుచుండును.

## 1) ప్రశ్న :- హిందూ ధర్మము అంటే ఏమిటి?

**జవాబు :-** ధర్మము అంటే రహస్యమైన నిర్ణయములతో కూడుకొన్నది యని అర్థము కదా! తెలియని ధర్మమును తెలియగలిగితే ధర్మము వెనుక దాగియున్న నియమములు ఏవో తెలిసిపోవును. అప్పుడు ధర్మములు గల ఆత్మగానీ, జీవాత్మగానీ తెలిసిపోవును. ధర్మమును తెలియుటకు మనిషికి జ్ఞానము అవసరము. జ్ఞానము అనగా తెలియబడు విధానము గలదియని చెప్పవచ్చును. జ్ఞానము వలన ధర్మమును తెలియవచ్చును. ధర్మము మర్మముగా యున్నా మర్మమును ఛేదించునది **జ్ఞానము.** జ్ఞానము విచక్షణతో

కూడుకొనియుండును. జ్ఞానము మనిషికి ప్రకృతి నుండి లభించవలెను. ప్రకృతిలోగల చంద్రుడు జ్ఞానమునకు అధిపతియని తెలియుచున్నది. చంద్రుడు సర్వ జ్ఞానములకు నిధిలాంటివాడు. చంద్రుని ఆధీనములో యున్న జ్ఞానమును చంద్రుడు ఇస్తే మనిషికి లభ్యమగును. **మనిషిలోని కర్మనుబట్టి ప్రపంచ జ్ఞానమును, మనిషిలోని శ్రద్ధనుబట్టి దేవుని జ్ఞానమును చంద్రుడు ఇవ్వగలడు.** అందువలన జ్ఞానమునకు చంద్రుని పేరే పెట్టారు. మనిషికిగల జ్ఞానమును **'చందము'** అని అంటారు. అట్లే మనిషికిగల రూపమును **'అందము'** అంటారు. అందము కనిపించేది. చందము (జ్ఞానము) కనిపించనిది. రూపి అనగా అందము గలవాడు అని అర్థము, కురూపి అనగా అందము లేనివాడు (అందహీనుడు) అని అర్థము. చందము గలవాడు అంటే జ్ఞానము గలవాడు యని అర్థము. అచందము అంటే జ్ఞానము లేనివాడు అజ్ఞాని అని అర్థము. చందము అను మాటను అందరూ వాడేవారు కాదు. అంద, చందములు ప్రపంచ సంబంధమైనవని చెప్పుచూ, దైవజ్ఞాన సంబంధమునకు మాత్రము చంద్రునికి మారు పేరయిన **'ఇందు'** అను పదమును వాడేవారు. **ఇందూ జ్ఞానము అంటే దైవజ్ఞానము** అని లెక్కించెడివారు. సృష్టించబడిన వానికి ధర్మము ఉండును అన్నట్లు, జీవుడు సృష్టించబడినవాడు అయినందున జీవునికి కూడా ధర్మములు గలవు. అవి అన్నియూ ప్రపంచ సంబంధ జ్ఞానము అయిన దానివలన దానిని **'చంద ధర్మములు'** అని చెప్పేవారు. **దైవ ధర్మములను 'ఇందూ ధర్మములు'** అనెడివారు. ఇందూ ధర్మమును ఇందూ జ్ఞానముతోనే తెలియవలెననియు, ప్రపంచ సంబంధ జీవుని ధర్మములను ప్రపంచ జ్ఞానముతోనే తెలియవలెననియు చెప్పెడివారు. ఇందూ జ్ఞానముతో తెలియబడు ఆత్మ ధర్మములను ఇందూ ధర్మములని చెప్పెడివారు.

**2) ప్రశ్న :- ఇందూ ధర్మములను దేవుని ధర్మములని ఒకచోట, అట్లే ఆత్మ ధర్మములని మరొకచోట చెప్పియున్నారు. దేవుని ధర్మములని చాలామార్లు చెప్పారు. వాస్తవముగా ఇందూ ధర్మములు దేవుని ధర్మములా, ఆత్మ ధర్మములా?**

**జవాబు :-** నేను ఇందూ ధర్మమును గురించి పూర్తి చెప్పకనే తిరిగి వేరొక ప్రశ్న వేశారు. సరే నీవు అడిగిన దానికి కూడా వివరమును చెప్పెదను విను. **మనుషుల చేత ఆరాధింపబడు దేవుడు ఒక్కడే** గలడు. ఎవడయితే మనుషులను సృష్ఠించాడో అతడే మనుషులకు దేవుడు. మొదటి సృష్ఠికర్తయిన పరమాత్మ ప్రకృతికి దేవుడు, అట్లే ఆత్మకు కూడా దేవుడే. పరమాత్మకు ధర్మములు ఉండవు. ధర్మములు ఉంటే నియమములకు కట్టుబడియున్న వాడగును. శాసనములతో కూడిన శాస్త్రమునకు బద్ధుడై ఉండును. **ఏ సూత్రమునకు, ఏ శాసనమునకు, ఏ ధర్మమునకు సంబంధము లేనివాడు ప్రకృతిని సృష్ఠించిన పరమాత్మ.** అందువలన పరమాత్మను ధర్మాతీతుడు అని అందురు. 'భక్తియోగము' అను దానిలో మొదటి దేవుడయిన పరమాత్మను శరణువేడవచ్చును. ఆయనున్నాడని తెలిసినవాడు "**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**" అని ప్రథమ దైవగ్రంథము అయిన భగవద్గీతలో మోక్షసన్న్యాస యోగము అను అధ్యాయమున 66వ శ్లోకములో ఈ విషయమును చెప్పియున్నారు. అయితే మూడు ఆత్మల విషయమును తెలిసినవాడు మొదటి దేవున్ని వినయముతో శరణుజొచ్చినా, అతడు రెండవ ఆత్మను దేవునిగా తలచి ఆరాధించవలసియుండును. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము 16-51 లో కూడా ఇలా చెప్పారు. దేవుడు ఈ విధముగా చెప్పుచున్నాడు. **"ఇద్దరు దేవుళ్లని ఆరాధించకండి. ఆరాధ్య దైవము ఆత్మ ఒక్కడే. ఆయనను ఆరాధించండి, నాకు భయ**

**పడండి."** భగవద్గీతలో చెప్పిన బ్రహ్మయోగము, కర్మయోగము రెండూ ఆత్మను ఆధారముగా చేయవలసిందే.

మనుషులయినవారు ఏ మతములో పుట్టియున్నా వారు ఆత్మను గురించిన ధర్మములను తెలియవలసిందే. **భగవద్గీత**లో చెప్పిన బ్రహ్మ, కర్మ యోగములను మిగతా రెండు దైవగ్రంథములలో కూడా చెప్పియున్నారు. మిగతా రెండు గ్రంథములయిన **బైబిలు, ఖురాన్**లలో వేరు భాషలో, వేరు వ్రాతలో, వేరు పేర్లలో వ్రాసియుండుట వలన భగవద్గీతలో చెప్పిన **బ్రహ్మ, కర్మ, భక్తి యోగములు**న్నాయని ఎవరూ తెలియలేకపోయారు. ఏ మతములో నయినా దేవున్ని గురించి తెలియాలంటే అతనికి ఆ మత గ్రంథమని చెప్పుకొను దైవ గ్రంథములోని జ్ఞానము తెలియాలి. అంతేకాక గ్రంథము లోని జ్ఞానము తెలిసిన జ్ఞాని అనిపించుకొన్న తర్వాత అతడు తెలిసిన జ్ఞానము ప్రకారము నడువాలి. అలా నడిచినప్పుడు అతడు తనకు తెలియకుండానే యోగములను ఆచరించినట్లగును. మూడు దైవగ్రంథము లలోను దేవుని ధర్మములను గురించి చెప్పియున్నారు. **భగవద్గీతలో ఆత్మయని చెప్పిన పేరును ఒక గ్రంథములో తండ్రియనీ, మరొక గ్రంథములో అల్లాహ్‌యనీ చెప్పియున్నారు.** **ఆత్మ** అనినా, **తండ్రి**యనినా, **అల్లాహ్** అనినా మూడు శరీరములోని దేవుని పేర్లేయని చెప్పవచ్చును. అందువలన దేవుని ధర్మములనినా, ఆత్మ ధర్మములనినా ఒక్కటేయనీ, ఆత్మ ధర్మములనే హిందూ ధర్మములని అంటున్నామని తెలియవలెను. ఏ మతములో దేవుని జ్ఞానమున్నా, ఏ మతములోని జ్ఞాని అయినా వాడు **ఆత్మ ధర్మములను** తెలిసినవాడగుట వలన వానిని **'హిందువు'** అని అనవలెను. హిందూ ధర్మము అంటే దేవుని ధర్మము లేక ఆత్మ ధర్మము అయిన దానివలన, ఆత్మ ధర్మమును హిందూ ధర్మములని చెప్పుట వలన, ప్రతి మతములోను జ్ఞానము ద్వారా ధర్మములను తెలిసిన వానిని 'హిందూ ధర్మము తెలిసినవాడు' యని చెప్పవచ్చును.

**3) ప్రశ్న :- మీరు మొదట 'హిందూ' అను పదమును చెప్పి తర్వాత 'ఇందూ' అను పదమును కూడా చెప్పారు. మీరు అలా ఎందుకు చెప్పారు? రెండు పదములలో ఏది సత్యమైన పదము ఇందువా? లేక హిందువా?**

**జవాబు :-** పూర్వము **'దృష్ఠి'** యను పదమును కంటిచూపుకు చెప్పెడివారు. కాలక్రమములో దృష్ఠియను పదము **'జిష్ఠి'** అను శబ్దముగా మారిపోయినది. రెండు అక్షరముల 'దృష్ఠి' అను పదములో మొదటి అక్షరము వేరుగా మారిపోయి రెండవ అక్షరము అలాగే నిలిచియున్నది. దృష్ఠి మొదట, తర్వాత జిష్ఠి. దృష్ఠి అనినా, జిష్ఠి అనినా రెండిటి అర్థము **'చూపు'** అని చెప్పుచున్నాము. అర్థములో మార్పు లేకున్ననూ, పదమును పలుకడములో ఒక అక్షరము మారిపోయి దృష్ఠి కాస్త జిష్ఠిగా మారిపోయినది. అదే విధముగా మొదట **ఇందూ** అను పేరు కాలక్రమమున ఒక అక్షరము మార్పు చెంది, ఇందూ కాస్త హిందువుగా చెప్పబడుచున్నది. ఇందూ అనినా, హిందువు అనినా రెండు శబ్దములు ఒకే విధముగా పలుకుచున్నా అందులో ఒక అక్షరము మార్పుచెంది మరొక అక్షరము అలాగే ఉండి పోయినది. 'దృష్ఠి' అను పదములో మొదటి అక్షరము పూర్తిగా వేరు అక్షరముగా అయిపోయినది. ఇక్కడ ఇందూ శబ్దములో మొదటి అక్షరము అచ్చు నుండి హల్లుకు మారినది. అందువలన అక్షర మార్పు జరిగినా, శబ్దము మాత్రము మొదటిలాగే పలుకబడుచున్నది.

మొదట యున్న అచ్చు గల **'ఇందు'** అను శబ్దమునకు **'జ్ఞాని'** అని అర్థము గలదు. అంతేగాక ఇందువు అంటే చంద్రుడు అని అర్థమును సూచించుచున్నది. తర్వాత మారిన హిందు అను శబ్దమునకు ఏమాత్రము

అర్థము లేకుండా పోయినది. దృష్ఠి శబ్దము పూర్తి అక్షరముతో సహా మారిపోయి దృష్ఠి, జిష్ఠి అయినా అర్థము మాత్రము మారకుండా రెండిటికీ చూపు అనియే గలదు. ఇందూ శబ్దములో మొదటి అక్షరము హల్లుగా మారి 'ఇందూ' పోయి 'హిందూ' అయినా పలికే శబ్దములో తేడా లేకపోయినా అర్థములో మాత్రము సంబంధము లేకుండా పోయినది. ఇందూ అంటే జ్ఞాని అనియు లేక చంద్రుడు అనియూ అర్థమున్నా హిందువు అను పదమునకు ఏమాత్రము అర్థము లేకుండా పోయినది. అయినా నేడు కొంతయినా విచక్షణ లేనివారు కొందరు తమను అర్థము లేని పేరుతో హిందువులము అని చెప్పుకొంటున్నారు. ఇందూ అనే పదము హిందువుగా దాదాపు 150 సంవత్సరముల నుండి పూర్తిగా మారిపోగా, 200 సంవత్సరముల క్రిందట ఆనాడు ఆంగ్ల పాలకులు ఇందూ అని సరిగా పలుకలేక హిందువులు అని పలుకడములో కొద్దికొద్దిగా మారుచూ వచ్చి, 150 సంవత్సరములకు పూర్తిగా మారిపోయినది. అలా ఆంగ్లపాలకులు పలుకుటకు కూడా ఒక కారణము గలదు. అది ఏమనగా! అప్పటికే భారతదేశములో ప్రవేశించి నివాసము ఏర్పరచుకొన్న ముస్లీమ్‌లు తమ అరబ్బీ భాషలో 'హిందూ అంటే దొంగ అనియూ, బేవకూబ్ అనియు, తెలివి తక్కువవాడు' యని అర్థము వచ్చుట వలన ఆనాటి ముస్లీమ్‌లు అదే పనిగా అచ్చు గల **'ఇందూ'** అని వ్రాయక, హల్లు గల **'హి'** తో హిందువులు అని వ్రాయుట వలన అందరూ అట్లే వ్రాయుచున్నారు. వాస్తవమైన విషయమును మేము చెప్పినా, నేడు వినే స్థితిలో ఇందువులు (హిందువులు) లేరు. హిందూ అను పదమునకు అర్థము ఏమి గలదు? అని భారత ప్రభుత్వమును ఒక న్యాయవాది ప్రశ్నించగా దానికి ప్రభుత్వము తరపున వచ్చిన జవాబును తర్వాత పేజీలో చూడవచ్చును.

# 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తేల్చింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు. (తేది:12.10.2015, సాక్షి న్యూస్‌పేపరు)

ఇవన్నియూ గమనించిన తర్వాత అర్థము లేని **హిందూ** అనే దానికంటే, అర్థముగల **ఇందూ** అని వ్రాయడము మంచిది. సోమవారము చంద్రుని వారమని చెప్పవచ్చును. ఆదివారమును సూర్యుని దినము అని

(తేది:21.01.2014, సాక్షి న్యూస్‌పేపరు)

# ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

చెప్పడము సహజము. అందువలన పూర్వము నుండి ఆదివారమును రవివారము అనీ, సోమవారమును ఇందువారము అని వ్రాసెడివారు. ఈ మధ్య కాలములో 2017 డిసెంబర్ 15వ తేదీ నుండి 19వ తేదీ వరకు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో, హైదరాబాద్‌లో **"ప్రపంచ తెలుగు మహా సభలు -2017"** జరిగినప్పుడు స్వచ్ఛమయిన తెలుగు భాషను అనుసరించి సోమవారమును **'ఇందూ వారము'** అని వ్రాయడము జరిగినది.

**వారములు -7**

| వారముల పేర్లు | తెలుగు పేర్లు |
|---|---|
| 1. ఆది వారము | రవి వారము |
| 2. సోమ వారము | ఇందు వారము |
| 3. మంగళ వారము | కుజ వారము |
| 4. బుధ వారము | బుధ వారము |
| 5. గురు వారము | బేస్త వారము |
| 6. శుక్ర వారము | శుక్ర వారము |
| 7. శని వారము | శని వారము |

**ఇందు** అనగా **చంద్రుడని** వారి భావము. జ్యోతిష్య శాస్త్రము ప్రకారము జ్ఞానమునకు అధిపతి చంద్రుడు అని ఉండుట వలన జ్ఞానము వలన తెలియు ధర్మములను ఇందూ ధర్మములని చెప్పుచున్నాము. ఇందూ అని చెప్పితే అర్థము సరిపోతుంది. హిందూ అని చెప్పితే అర్థము లేకుండా పోవును. పూర్వము ప్రపంచ దేశములలోకెల్లా జ్ఞానము గల దేశము భారతదేశమే అయివుండుట వలన భారతదేశమును **'ఇందూ దేశము'** అని చెప్పెడివారు. అంతేకాక జ్ఞానమున్న స్త్రీని ఇందుమతి యని చెప్పెడివారు గానీ, హిందుమతి యని చెప్పేవారు కాదు. ఇప్పుడు కూడా 'ఇందుమతి' యని, ఇందిర అని పేరుండుటను మీరు అక్కడక్కడా చూడవచ్చును. ఎన్ని విధముల చూచినా పూర్వము తెలుగు భాష యొక్క అర్థము ప్రకారము **'ఇందూ'** అను పదమును చేర్చి **ఇందూ ధర్మము** అనియు, **ఇందువు** అనియు చెప్పడము సరియైనది, హిందూ ధర్మము అనిగానీ, హిందువు అనిగానీ అనడము తప్పు.

4) ప్రశ్న :- మీరు చెప్పినది సత్యమేయని మేము నమ్మ గలము. అయితే ఒక స్వామీజీగారు హిందూ అను పదమే సరియైనదనీ, ఇందూ అని పలుకడము తప్పయనీ చెప్పచూ, హిందూ అను పదమునకు అర్థమును చెప్పచూ ఇలా అన్నారు. హిం అనగా పాపము అనియు, దూ అనగా నాశనము అనియు హిందూ అనగా పాపమును నాశనము చేయునది అనియు, హిందువు అనగా పాపమును నాశనము చేయు వాడు అనియు లేక పాపము నాశనమయినవాడు అనియు చెప్పచున్నాడు. ఈ అర్థమును వింటూనే ఇది సరియైన వివరణ కాదనియు, శాస్త్రబద్ధమైన అర్థము కాదనియు, ఉన్న అర్థమును వదలివేసి లేనిదానిని తెచ్చి అతికించినట్లున్నదని మాకు తెలియుచున్నది. దీనికి మీరు ఏమంటారు?

**జవాబు :-** స్వామీజీలు ఎవరు చెప్పినా వినవలసిందే, దానిని తప్పు అని వారితో చెప్పకూడదు. శాస్త్రబద్ధమైనది కాకపోతే ఎవరు చెప్పినా దానిని వదలి వేయవలసిందే. శాస్త్రబద్ధమైన సత్యమైన అర్థమైతే దానిని ఎవరు చెప్పినా గ్రహించవలసిందే. ఇక్కడ స్వామీజీ చెప్పిన జవాబులో పాపమును నాశనము అను అర్థమును హిందూ అను పదమునకు అతికించినట్లయినది. పాపమును హరించునది హిందూ శబ్దమునకు అర్థమయితే, మనిషికి పాపము ఒక్కటే యుండదు. పాపపుణ్యములు రెండూ కర్మ బంధనములే. పాపము ఎట్లు జన్మమును కలిగించుచున్నదో అట్లే పుణ్యము కూడా జన్మకు కారణమగుచున్నది. **మనిషి జన్మరాహిత్యమునకు పాపము, పుణ్యము రెండూ లేకుండా పోవలసియున్నది.** అందువలన పాపమును లేకుండా చేయునది

అను అర్థమును హిందూ పదమునకు తెలివిగా జోడించినా, దానివలన మనిషికి లాభము లేదని అటువంటి హిందువుకు జన్మలు లేకుండా పోయి మోక్షము కలుగదనీ చెప్పవచ్చును. ఇందూ అను పదమునకే చెప్పిన భావము ప్రకారము విలువ కలదని చెప్పవచ్చును. హిం అనగా పాపము అని కల్పించి చెప్పవలసిందేగానీ వాస్తవముగా **హిం** అంటే హిమము, మంచు అనీ లేక చల్లదనము అని అర్థము వచ్చును. ప్రక్కలో గల **దూ** కు ఎటువంటి అర్థము లేదని చెప్పవచ్చును. అందువలన హిందూ అను పదమునకు సరియైన అర్థము ఏదీ లేదని చెప్పవచ్చును.

మనిషి ఏ మతములో యున్నా ఆ మత గ్రంథము ప్రకారము అతడు జ్ఞానమును తెలియవలసి యున్నది. **జ్ఞానము**ను తెలిసినవానిని **'ఇందువు'** అని చెప్పడములో తప్పులేదు. జ్ఞానమునకు అధిపతి చంద్రుడే అగుట వలన మనిషికి అతని జీవితములో చంద్రుని వలననే జ్ఞానము లభించవలసియున్నది. కావున అన్ని విధముల అచ్చు **'ఇ'** తో మొదలగు ఇందువు అని చెప్పాలిగానీ, హిందువు అని చెప్పకూడదు. ఇందూ ధర్మము ఎప్పటికయినా దైవధర్మముగా ఉండును.

## 5) ప్రశ్న :- దేవునికి ధర్మమున్నట్లు మనిషికి కూడా ధర్మములుండునా? మనిషికి ధర్మమునకు సంబంధమున్నదా?

**జవాబు :-** సృష్టింపబడిన ప్రతి దానికి ధర్మముండును అని తేల్చి చెప్పాము. మనిషికి ధర్మములున్నా శరీరమునకు వేరు ధర్మములు, జీవునికి వేరు ధర్మములు ఉండును. మనిషి అయిన ప్రతి వానికి ధర్మములుండును. హిందువుకు మాత్రము ధర్మములుండునని, ఇతర మతములవారికి ఉండవనుటకు వీలులేదు. పుట్టినవాడు ఏ మతము వాడయినా వానికి ధర్మములుండునని తెలియాలి.

## 6) ప్రశ్న :- హిందూ ధర్మములు నశిస్తాయా?

**జవాబు :-** ధర్మములు నశించునవి కావు. ధర్మములకు ఎప్పుడో ఒకప్పుడు **గ్లాని** (అలసత్వము) ఏర్పడునుగానీ, పూర్తి నశించవు. ధర్మములు నీరసించి పోయినప్పుడు వాటికి బలమును చేకూర్చి, ముందువలె పని చేయులాగా చేయుటకు దేవుడు మనిషివలె అవతరించి తిరిగి ధర్మములను సంస్థాపన చేయును. క్రొత్తగా బలము చేకూరిన ధర్మములు ముందువలె బలముగా ఉండిపోవును.

## 7) ప్రశ్న :- ధర్మములు నశించునవి కాకపోతే ప్రపంచ పుట్టుక నుండి మొదట యున్న ధర్మములే యున్నాయా?

**జవాబు :-** ప్రపంచము పుట్టుకలో యున్న ధర్మములే నేడు కూడా కలవని, మొదట యున్న ధర్మములు పోయి వాటి స్థానములో క్రొత్త ధర్మములు రావు. ఎందుకనగా! ధర్మములు మారునవి కావు, నశించునవి కావు. అందువలన మిరపకాయ మొదట ఎట్లు కారముగా యున్నదో అట్లే ఇప్పుడు కూడా కారముగానే యున్నది. మిరపకాయకు కారము ధర్మమైనప్పుడు అది మారలేదు కదా! అట్లే నిమ్మకాయకు పులుపు ధర్మమైనప్పుడు అది ప్రపంచ పుట్టుకలో యున్నట్లే నేడు కూడా పుల్లగనే యున్నది కదా! ఈ విధముగా ప్రపంచములో దేనికున్న ధర్మములు దానికి ఉండును. అవి ఎప్పటికీ మారలేదు, నశించనూ లేదు. ప్రకృతిలోని ధర్మములు ఏవీ మారనప్పుడు ఆత్మకు సంబంధించిన ధర్మములు మారుటకు అవకాశమే లేదు, అట్లే నశించుటకు వీలులేదు. ఆత్మ ధర్మములకు గ్లాని ఏర్పడుననీ, దానిని తిరిగి ఉద్ధరించి బలము చేకూర్చుదునని దేవుడే దైవ గ్రంథములలో చెప్పియున్నాడు. దీనినిబట్టి **ఏ ధర్మము నశించదు మరియు మార్పు చెందదు** అని చెప్పవచ్చును.

**8) ప్రశ్న :- క్రైస్థవులు, ముస్లీమ్‌లు పుట్టుకొచ్చారు కదా! వారి మతములో ప్రత్యేకమైన జ్ఞానమున్నప్పుడు ధర్మము కూడా ప్రత్యేకముగా ఉండును కదా! వారి ధర్మములు ఏవి గలవు?**

**జవాబు :-** మనిషి మొదట ఆవునుండి పాలు లభ్యమవుతాయని తెలియ గలిగాడు. దూడలు ఆవుల యొద్ద పాలు త్రాగడము చూచి తాను కూడా ఆవు నుండి పాలను సేకరించి త్రాగెడివాడు. మనిషి మొదట పాలను తెలియగలిగినప్పుడు పాలను పాలుగానే త్రాగెడివాడు. కొంత కాలము పోయిన తర్వాత పాలను పెరుగుగా తయారు చేసుకొని పెరుగును త్రాగేవాడు. ఇట్లు కాలము జరుగుకొద్ది మానవుడు పాలనుండి పెరుగును, పెరుగు నుండి వెన్నను, వెన్న నుండి నెయ్యిని తయారు చేసుకొని త్రాగెడి వాడు. ఒకే పాల నుండి నాలుగు రకముల ఆహార పదార్థములు తయారయి నట్లు ఒకే ధర్మమును పేర్లు మార్చి క్రైస్థవులు, ముస్లీమ్‌లు అని వేరు వేరు మత ధర్మములుగా చెప్పుకొంటున్నారు. అయితే పాలను ఎట్లు వేరు వేరు పేర్లు గల ఆహారములుగా తయారు చేసినట్లు, ఒకే ధర్మము నుండి వేరు వేరు పేర్లు గల మతములను మనిషి తయారు చేసుకొన్నాడు. పాలు పెరుగు, వెన్న, నెయ్యి అను భాగములుగా మారినా వాటిలో పాల ధర్మములే యున్నట్లు, మనిషి ఒకే ధర్మము నుండి ఎన్ని మతములుగా చీలిపోయినా వారి ధర్మముల పేర్లు వేరువేరుగా చెప్పుకొనినా, వారు అనేక పేర్లుగా చెప్పు మత ధర్మములన్నియూ మొదటి ధర్మములోనివే యని చెప్పవచ్చును. మొదట తయారయిన పాలలోని ధర్మము, పాల నుండి తయారయినా, మిగతా ఎన్ని ఆహారములుగా మారినా, వాటిలో పాల ధర్మములే యున్నట్లు, మొదట సృష్ట్యాదిలో తయారయిన **"ఇందూ ధర్మము"** ఎన్ని విధముల ధర్మములుగా చీలిపోయినా, ఆ ధర్మములన్నిటిలో మొదటి ఇందూ ధర్మమే

యుండునని తెలియవలెను. అదే విధముగా నేడు ఎన్ని మతములు యున్నా, వాటిలో ఎన్ని జ్ఞానములు యున్నా, అవన్నియు దేవుని ధర్మమునకు సంబంధించినవే. దేవుడు ఒక్కడే, ధర్మము ఒక్కటే. ఎన్ని మతములున్నా అవి పాల నుండి తయారయిన పెరుగు, వెన్న, నెయ్యిలాంటివే. అదే విధముగా నేడు ఎన్ని మతములు తయారయినా అవన్నియు ఇందూ ధర్మము నుండి తయారయి నవే. **అన్ని మతములలోని ధర్మము ఒక్కటే, దేవుడు ఒక్కడే.** ఎట్లు పాలను గురించి సంపూర్ణముగా తెలిసినవాడు పెరుగును గురించి, వెన్నను గురించి, నెయ్యిని గురించి సులభముగా చెప్పగలడో, అట్లే ఇందూ ధర్మమును గురించి పూర్తి తెలిసినవాడు మిగతా ఏ మతములోని ధర్మమును గురించి అయినా మాట్లాడగలడు. ఈ సూత్రము ప్రకారము నాకు ఇందూ ధర్మమును గురించి పూర్తిగా తెలియును, గనుక నేను సులభముగా మూడు మతములను గురించి మాట్లాడుచున్నాను. దీనినిబట్టి దేశములో మిగతా మతములు ఎన్నియున్నా, వాటి ధర్మములు వేరువేరుగా కనిపించినా, అన్నీ ఒకే ధర్మమునకు అనుసంధానమై యున్నవని తెలియవలెను.

## 9) ప్రశ్న :- ఒక క్రొత్త పదార్థము తయారయితే దానికి క్రొత్త ధర్మము తయారగునా?

**జవాబు :-** ప్రపంచములో ఏ క్రొత్త పదార్థము తయారయినా దానికి సంబంధించిన ధర్మము ముందే నిర్ణయమై ఉండును. ఒక పదార్థము తయారయితే అది ప్రకృతికయినా లేక ఆత్మకయినా సంబంధించినదై ఉండును. ప్రపంచములో విభజించితే ప్రకృతి ధర్మములనీ, ఆత్మ ధర్మములనీ రెండు రకముల ధర్మములు తయారైయున్నవి. పదార్థము ఏదయినా అది ప్రకృతికి సంబంధించినదై యుండుట వలన దానికి సంబంధించిన

ధర్మము ఆదిలోనే తయారు చేయబడి యుండును. అందువలన క్రొత్త పదార్థము తయారైనా **క్రొత్త ధర్మము** అప్పుడు తయారగునది ఏదీ లేదు. దానికి సంబంధించిన ధర్మము ముందే యుండును అని తెలియవలెను.

## 10) ప్రశ్న :- దేవునికి, ధర్మమునకు సంబంధము ఏమి?

**జవాబు :-** నీ ప్రశ్న అసంపూర్ణముగా యున్నది. నీవు దేవున్ని గురించి అడిగావు. **దేవుడు అనువాడు ఇద్దరుగా ఉన్నాడు.** ఆ ఇద్దరిలో నీవు ఏ దేవున్ని అడుగుచున్నావో నాకు తెలిస్తే నీకు సరిగా జవాబును చెప్పుటకు వీలగును. **ప్రకృతిని మొట్టమొదట సృష్ఠించిన సృష్ఠికర్తయిన దేవుడు ఒక్కడు గలడు. తర్వాత ఆ దేవుని చేత సృష్ఠింపబడిన ఆత్మయను దేవుడు గలడు.** నీవు సృష్ఠింపబడిన దేవున్ని గురించి అడుగుచున్నావా? లేక సృష్ఠించిన దేవున్ని గురించి అడుగుచున్నావా? చెప్పితే నీకు జవాబు దొరుకుతుంది. మనిషికి దగ్గరగా యున్న దేవుడూ, మనిషి ఆరాధనలను స్వీకరించు దేవుడూ, మనుషులకు దేవుడై యున్నవాడు ఒక దేవుడు కాగా, మనిషితో సంబంధము లేని దేవుడు మరొకడు గలడు. ఇద్దరు దేవుళ్లలో మనుషులను సృష్ఠించు దేవుడయిన ఆత్మే మనుషులకు దేవుడుగా చెప్పబడుచున్నాడు. మనుషులను సృష్ఠించని పరమాత్మ మనుషులకు దేవుడుగా లేడని చెప్పవచ్చును. పరమాత్మ ఆత్మను సృష్ఠించిన దేవుడు. కావున ఆయన ఆత్మకు దేవుడు, ఆత్మ మనుషులను సృష్ఠించాడు. కావున ఆయన మనుషులకు దేవుడు. ఆత్మకు దేవుడయిన పరమాత్మ ప్రకృతిని సృష్ఠించాడు. తర్వాత ఆత్మను సృష్ఠించాడు. ఆయన సృష్ఠికర్త అయిన దానివలన దేవుడేయని చెప్పబడినా, మనుషులకు దేవుడు కాడుయని చెప్పవచ్చును. మనుషులను సృష్ఠించిన దేవున్ని సృష్ఠించిన పరమాత్మను ఆత్మకు దేవుడనీ, ఆత్మ మనుషులకు దేవుడనీ చెప్పవచ్చును.

సృష్ఠికర్త అయిన పరమాత్మకు ధర్మములు లేవు. సృష్ఠింపబడిన ఆత్మకు ధర్మములు గలవు. అందువలన నీవు అడిగినది ఆత్మకు సంబంధించిన ప్రశ్నయేగానీ, పరమాత్మకు సంబంధించినది కాదు. మనుషులను సృష్ఠించి, పాలించి, మరణింపచేయు ఆత్మ మనుషులకు దేవుడై యుండుట వలన ఆయనకు ధర్మములున్నవి. **దేవునికి, దేవుని ధర్మములకు దేహికి, దేహమునకు ఉన్నంత సంబంధము ఉండును.** ఆత్మ కర్మాతీతుడు అయినా శరీరములో దూరి పని చేయవలసియున్నది. నిత్యము శరీరముతో పాటు నివశించవలసి యున్నది. ఏ విధముగా శరీరమును వదలి ఆత్మ లేదో, అదే విధముగా ధర్మములను వదలి ఆత్మ లేదు. ఆత్మకు ధర్మము లోపలి పొరలాంటిది కాగా, జ్ఞానము పై పొరలాంటిదియని చెప్పవచ్చును. ధర్మమును తెలియాలంటే జ్ఞానము ద్వారా తెలియవచ్చును. **జ్ఞానము ధర్మమును తెలియజేయగా, ధర్మము ఆత్మను తెలియజేయును.** ఆత్మ పరమాత్మను తెలియజేయును. పరమాత్మను తెలియజేసి పరమాత్మ లోనికి జీవాత్మను కలుపును. జీవాత్మ పరమాత్మలో కలిసిపోవడమును **మోక్షము** అని అంటున్నాము. జీవాత్మ పరమాత్మలో కలియుటకు ఆత్మ ధర్మములను జీవాత్మ తెలియవలసియున్నది. రెండవ సృష్ఠికర్తయిన ఆత్మ యను దేవునికి ధర్మములు గలవు. మొట్టమొదటి సృష్ఠికర్తయిన పరమాత్మ యనబడు దేవునికి ధర్మములు ఉండవు.

## 11) ప్రశ్న :- ఇందూ ధర్మములు ఒక దేశమునకు గానీ, లేక ఒక మతమునకు గానీ పరిమితమా?

**జవాబు :-** ఆహారము మనుషులకు అవసరమా లేక జంతువులకు కూడా అవసరమా యని అడిగినట్లు నీ ప్రశ్న గలదు. ధర్మములు ఒక ప్రాంతము నకు, ఒక దేశమునకు, ఒక మతమునకు పరిమితముగాక మనుషులయిన

వారందరికీ ధర్మములు అవసరమేయని చెప్పవచ్చును. ఒక దేశములోనే, ఒక మతములోనే మనుషులు ఉన్నారని చెప్పలేము. అన్ని మతములలో అన్ని దేశములలోను మనుషులున్నారు. కావున మనిషి అయిన ప్రతివాడు ధర్మములు తెలియవలసి యున్నది. అందువలన ధర్మములు ఒక దేశము నకు, ఒక మతమునకు పరమితియైనవి కావు. దైవజ్ఞానమున్న ప్రతీ చోటా ఇందూ ధర్మములు గలవు. క్రైస్థవుల గ్రంథము బైబిలులోనూ, ముస్లీమ్‌ల గ్రంథము అయిన ఖురాన్‌లోనూ, హిందువుల గ్రంథమయిన భగవద్గీతలోనూ ఇందూ ధర్మములు గలవు. మూడు మతములలో, మూడు గ్రంథములలో ఇందూ ధర్మములు ఇమిడియున్నవి. అందువలన **'ఇందూ ధర్మములకు పరిమితి లేదు'** అని చెప్పవచ్చును.

## 12) ప్రశ్న :- ఇందూ ధర్మములలో వేరు వేరు రకములు ఉన్నాయా?

**జవాబు :-** ఇందూ అంటే దేవునికి సంబంధించిన జ్ఞానము అని అర్థము. ధర్మములు అంటే ముందే చెప్పియున్నాము. ఇందూ ధర్మములు అనగా దేవునికి సంబంధించిన ధర్మములే గానీ వేరు ఏమీలేదు. మనుషులను సృష్ఠించిన దేవుడు, సృష్ఠింపబడి యుండుట చేత ఆయనకున్న ధర్మములనే ఇందూ ధర్మములు అని అంటున్నాము. మనుషులను సృష్ఠించిన దేవుడు ఒక్కడే, మనుషులను సృష్ఠించుటకు సృష్ఠింపబడిన దేవుడు ఒక్కడే. అందువలన **మనుషులందరికీ ఆరాధ్యదైవము ఒక్కడే** అయినదానివలన **ఇందూ ధర్మములు ఒక్కటే.** మనుషులను పుట్టించిన దేవుడు ఒకచోట పరమాత్మనీ, మరొకచోట తండ్రియనీ, ఇంకొక చోట అల్లాహ్‌యనీ చెప్ప బడుచున్నాడు. మతములు అనేక రకములయినా అందరికీ దేవుడు అనువాడు ఒక్కడే. సృష్ఠింపబడి, అందరినీ సృష్ఠించిన దేవుడయిన ఆత్మను

గురించి అందరూ తెలియాలని, అన్ని మతములలో బోధింపబడు సారాంశము ఒక్కటే అయినందున, ఎక్కడ ఏ మతములో దేవున్ని గురించి చెప్పుచున్నా, అక్కడ ఇందూ ధర్మములు తప్ప ఏమీ లేవు. అందువలన **సమస్త మానవులకు ధర్మములు** వేరు వేరు పేర్లతో కనిపించినా, మతముల పేరుతో పిలువబడుచున్నా, దేవున్ని గురించి చెప్పబడునవన్నీ **ఇందూ ధర్మములే**యని తెలియవలెను.

## 13) ప్రశ్న :- చావు పుట్టుకలు కర్మములా? ధర్మములా?

**జవాబు :-** చావు పుట్టుకలు సమస్త జీవరాసులకు సంబంధించినవి. అవి ఒక కులమునకు గానీ, ఒక మతమునకు గానీ పరిమితమైనవి కావు. చావు పుట్టుకలు కర్మములు కావు, ధర్మములని తెలియవలెను. కర్మములున్నా కర్మములు లేకున్నా చావు పుట్టుకలు సహజముగా వచ్చును. చావు పుట్టుకలు కర్మను అనుసరించి వచ్చునవి కావు. అవి జీవరాసులకున్న ధర్మములను బట్టి వచ్చునవియని తెలియవలెను. జీవుడు కూడా ఆత్మలో భాగముగానే యుండుట వలన జీవునికి కూడా ధర్మములు కలవని చెప్పవచ్చును. పరమాత్మ చేత ఆత్మ సృష్టింపబడగా, ఆత్మ చేత జీవాత్మ సృష్టింపబడినాడు. సృష్టింపబడిన వారికి ధర్మములు ఉండును. జీవునికి గల ధర్మములలో జీవుని చావు పుట్టుకలు గలవు. అందువలన **చావు పుట్టుకలు ధర్మములే** గానీ, కర్మములు కావని చెప్పవచ్చును. మనిషి బ్రతికియున్నంత వరకు కర్మలు వచ్చుచుండును, అట్లే అయిపోవుచుండును. ధర్మమునకు సంబంధించిన మరణము వచ్చు వరకు జీవుడు కర్మలను అనుభవించు చుండును. అలా అనుభవిస్తున్నప్పుడే ఒక్కమారు మరణము వచ్చును. మరణము జీవునికున్న ధర్మము వలన వచ్చుచున్నది కానీ, అతనికున్న కర్మము వలన కాదు. కర్మ వలన కష్టసుఖ అనుభవములు వచ్చుచుండును. అట్లే జీవుని కర్మవలన వచ్చునట్లే మరణము కూడా వచ్చుచున్నది.

ధర్మము విషయము తెలియని వారందరూ మరణమును కర్మమే అని అనుకుంటున్నారు. అట్లు అనుకోవడము అజ్ఞానమే యగును.

## 14) ప్రశ్న :- మీరు ఏ ధర్మములో యున్నారు?

**జవాబు :-** మీ ప్రశ్న విచిత్రముగా యున్నది. నేను మీ లెక్కలో ఒక గురువునో, స్వామినో, బాబానో లేక ఇంకా ఏమయినా, చివరకు నేను ఒక మనిషినే అనునది మాత్రము సత్యము. మనిషిలో రెండు ఆత్మలు గలవు. ఒకటి ఆత్మ, రెండు జీవాత్మ. ఈ రెండు ఆత్మలలో మొదటి ఆత్మను దేవుడు అనియు, రెండవ జీవాత్మను జీవుడు అనియు చెప్పవచ్చును. సత్యమును చెప్పితే నేను బయటికి ఎవరయినా, లోపల జీవుడను మాత్రమే. అందువలన జీవుని ధర్మములు నాకు ఉన్నవి. అయినా నేను ప్రస్తుతము నా ధర్మములలోనే యుండి బ్రతుకుచున్నా, నేను ఆత్మ ధర్మములను తెలిసి ఆత్మలో చేరిపోవడము నా కర్తవ్యము. ఇప్పుడు మీరు అడిగిన ప్రశ్నకు జవాబును చెప్పితే **"నా ధర్మములలో నేను యున్నాను".** చాలామందికి వారి ధర్మములు వారికి తెలియవు. తెలిసినా తెలియకపోయినా వారి ధర్మముల ప్రకారము వారు బ్రతుకుచున్నారు. నా ధర్మము ప్రకారము చేప నీళ్లను కోరినట్లు, జీవాత్మనయిన నేను ఆత్మను కోరుకొంటున్నాను.

## 15) ప్రశ్న :- ధర్మములకు, శాస్త్రములకు సంబంధ మున్నదా?

**జవాబు :-** శాసనములతో కూడుకొన్నవే ధర్మములని ముందే చెప్పి యున్నాము. సిద్ధాంతము శాస్త్రమునకు ఆధారము. **శాస్త్రము ధర్మమునకు ఆధారము.** శాసనము లేని ధర్మము లేదు. కావున ధర్మములకు, శాస్త్రములకు దారమునకు దూదికి ఉన్నంత సంబంధము గలదు. దూది

శాసనములయితే దారము ధర్మములాగ ఉన్నది. అందువలన ధర్మము అనగా కొట్టివేయబడునది గానీ, సవరించబడునది గానీ, మార్పుచెందునది గానీ కాదని చెప్పవచ్చును.

## 16) ప్రశ్న :- నేడు హిందువులను వారికి వారి ధర్మములు తెలుసునా?

**జవాబు :-** నేడు 'దేవుని జ్ఞానమును తెలిసిన వారిని ఇందువులని' అనవచ్చును. దేవుని జ్ఞానము (ఆత్మ జ్ఞానము) తెలిసిన ఏ మతస్థుడయినా ఇందువేయగును. అట్లు ధర్మములు తెలియకుండా నేను హిందువునని చెప్పుకొనినా, లేక క్రైస్థవుడనని నా, ముస్లీమ్‌నని చెప్పినా వారు మతమును అనుసరించి చెప్పువారేగానీ, ధర్మములను అనుసరించి చెప్పువారు కాదు యని చెప్పవచ్చును. నేడు అందరూ మతమును అనుసరించే పోతున్నారు గానీ, ధర్మమును అనుసరించి పోవడము లేదు. అందువలన హిందువులకు వారి ధర్మములు తెలియునని చెప్పలేము. ఎక్కడయినా ధర్మము తెలిసిన హిందువు ఉంటే వాడు తనను 'హిందువు' అని చెప్పుకోక 'ఇందువు'నని చెప్పుకొనును. ఏ మతము వారికయినా ఇదే సూత్రము వర్తించును.

## 17) ప్రశ్న :- దేవతా పూజలు చేయువారు హిందువులా? (ఇందువులా?)

**జవాబు :-** దేవతల పూజ చేయువారికి **ఆత్మ ధర్మములు** ఏమాత్రము తెలియవు. ఆత్మ ధర్మములు తెలిసియుంటే దేవతల పూజలు చేయరు. కావున దేవతా పూజలు చేయువారిని **'ఇందువులు' (జ్ఞానులు)** అనుటకు అవకాశము లేదు.

**18) ప్రశ్న :- నేడు ఒక సమాజములో పేరుపొందిన స్వామీజీలందరూ దేవతా పూజలు చేయుచున్నారు. వారు ఎందుకు అలా చేయుచున్నారు?**

**జవాబు :-** 'మేము మంచివారము' అని బోర్డు పెట్టుకొన్నవారు కూడా తప్పు చేయుచున్నారంటే మంచి ఏదో వారికి తెలియదనియే చెప్పాలి. మనిషికి మంచి, చెడు తెలియకున్నా సమాజములో ఇది మంచి, ఇది చెడుయని ముందే నిర్ణయించబడియుండును. అదే విధముగా ఇది ధర్మము, ఇది అధర్మము అని దేవుని మార్గములో నిర్ణయింపబడియున్నవి. ధర్మము ప్రకారము **మనిషి ఆత్మను ఆరాధించవలెనుగానీ, ఆత్మ తయారు చేసిన మనుషులను, దేవతలను ఆరాధించడము అధర్మము అగును.** నేడు కేవలము ఒక మతమునకు సంబంధించిన వారే దేవతలను ఆరాధించడము జరుగుచున్నది. దేవతలు మనుషుల చేత ఆరాధింపబడుటకు వారు ఎవరు? వారు అర్హులా, అని వివరించుకొని చూస్తే కొంత విషయము తెలియగలదు. అది ఏమనగా! దేవుడు అయిన ఆత్మ, పరమాత్మ చేత అధికారమును పొంది మానవ సమాజము మరియు జీవరాసులతో నిండిన జగతిని తయారు చేయడము జరుగుచున్నది. 'జగతి' అనగా పుట్టి చస్తూ యుండునదని అర్థము. జగతిలో **'జ'** అనగా పుట్టడము అనియూ, **'గతి'** అనగా గతించి పోవడము (చనిపోవడము) అని అర్థము గలదు.

ఆత్మయిన దేవుడు జగతిని సృష్టించుచున్నాడు. అయితే జగతి ఒకటి కనిపించు స్థూల జగతి, రెండు కనిపించని సూక్ష్మ జగతియని రెండు రకములు గలదు. స్థూల జగతిగా మనుషులు, జంతువులు, పక్షులు, సర్పములు మొదలగునవి ఎన్నో గలవు. అట్లే కనిపించని సూక్ష్మ జగతిగా దేవతలు మొదలగు జీవరాసులు గలరు. దేవతలను కనిపించని ఒక

మనుష జాతిగా చెప్పుచున్నాము. మనిషిని కనిపించే రెండవ రక మనిషి జాతిగా చెప్పుచున్నాము. కనిపించని వానిని దేవతయని అంటున్నాము. దేవతా జాతిలో మనుషుల వలె ఆడ, మగ (స్త్రీ, పురుషులు) గలరు. కనిపించే మనిషిని, కనిపించని దేవతలను దేవుడు సృష్ఠించగా, మనిషి సృష్ఠించిన దేవున్ని తెలియక, ఆయననే ఆరాధించక, అధర్మమార్గములో తనవలె సృష్ఠింప బడిన దేవతలను ఆరాధించుచున్నాడు. యజమానివలె యున్న ఆత్మను ఆరాధించక, బజారులో భిక్షాటన చేయువారి దగ్గరికి పోయి భిక్షమడిగి నట్లున్నది. మనిషికి దేవుడు ఏమయినా ఇవ్వగలడు గానీ, దేవతలు ఏమీ ఇవ్వలేరు. మనిషి ఆ విషయమును తెలియక దేవతలు తాము కోరినవి ఇవ్వగలరని నమ్మి దేవతలను ఆరాధించుచున్నాడు. మనిషి ఆధ్యాత్మిక మార్గములో ఆత్మను తెలియవచ్చునుగానీ, అట్లుకాకుండా దేవతలను ఆరాధించడము పెద్ద పొరపాటు యని చెప్పవచ్చును. మనిషికున్న ధర్మముల ప్రకారము దేవుని ధర్మములను జ్ఞానము ద్వారా తెలిసి ఆరాధించవలెను.

దేవతాపూజ చేయువారు ఎంత పెద్ద స్వాములుగాయున్నా, వారికి దేవుడు భగవద్గీతలో చెప్పిన జ్ఞానము తెలియదనియే చెప్పవచ్చును. **"ఎవడు అన్య దేవతారాధన చేయుచున్నాడో వాడు దారితప్పి నడచిన వాడుయని"** భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమున 23వ శ్లోక మందు "యజ్యన్త్య విధిపూర్వకమ్" అని చెప్పియున్నారు. దేవుని విషయము తెలిసినవాడు దేవుని చేత సృష్ఠింపబడిన దేవతలను ఆరాధించడు. అలా దేవతలను ఆరాధించాడు అంటే వానికి దేవుని విలువగానీ, దేవుని జ్ఞానముగానీ తెలియదనియే చెప్పాలి. ఇంట్లో తండ్రిని గౌరవించక వీధిలో అడుక్కొనేవానిని గౌరవిస్తే అప్పుడు వాడు తండ్రికి విలువనివ్వనట్లే కదా! అదే విధముగా సృష్ఠించిన దేవున్ని వదలి, సృష్ఠింపబడిన దేవతలను ఆరాధిస్తే

దేవున్ని అగౌరవపరచినట్లే కదా! **"అన్య చింతన లేకుండా నన్నే ఆరాధించుము"** అని భగవద్గీతలో దేవుడు చెప్పితే దేవుని మాటను కాదని, అన్యచింతతో దేవతలను ఆరాధించువారు దేవుని విషయము తెలియనివారేయని చెప్పవచ్చును.

**19) ప్రశ్న :- భగవద్గీతను బోధించు ఒక స్వామీజీ ఒక ఆడ దేవతను ఎక్కువగా పూజిస్తూ ఉంటాడు. అతనిని అడిగితే దేవతలనందరినీ పూజించడము హిందువుల కర్తవ్యము. అలా దేవతలను ఆరాధించనివాడు హిందువే కాడు అని అన్నాడు. మీరు దేవతలను ఆరాధిస్తే వానిలో అజ్ఞానమున్న దనీ, అట్టివాడు జ్ఞాని కాడు అనీ అంటున్నారు. వారు భగవద్గీతను చెప్పుచున్నారు. దేవతలను ఆరాధించుచున్నారు. దేవతలను ఆరాధించే వారిది తప్పా? ఆరాధించని మీది తప్పా?**

**జవాబు :-** ఎవడు చేసే పనిని వాడు సమర్థించుకోవచ్చును. అయినా ఆ పనిని గూర్చి అది మంచిదో, చెడ్డదో ముందే నిర్ణయము జరిగియుండును. మనిషి దైవభక్తియని చేయు పనులను మంచి చెడుయని తేల్చి చెప్పునది బ్రహ్మవిద్యా శాస్త్రము. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము మూడు దైవ గ్రంథములు దేవుని చేత చెప్పబడియున్నవి. ఆ మూడు గ్రంథములలో **మనిషిని సృష్టించిన దేవున్ని ఆరాధించవలెనని, మనిషితో సమానముగా సృష్టింపబడిన దేవతలను ఆరాధించరాదనీ,** అలా ఆరాధించినా, ప్రార్థించినా దేవున్ని అగౌరవపరచినట్లని, సృష్టికర్తయిన వానినే ఆరాధించవలెనని

మూడు దైవ గ్రంథములలో చెప్పడమేకాక, దేవున్ని ఎలా ఆరాధించవలెనో తెలియుటకు కావలసిన ధర్మములన్నిటినీ జ్ఞానరూపములో ఆ గ్రంథముల యందు చెప్పియున్నారు. ప్రతి మనిషి దైవగ్రంథమును చదివి, అందులోని ధర్మములను తెలిసి, దేవున్నే ఆరాధించవలెనని అట్లుకాకుండా **దేవతలను ఆరాధిస్తే అది అజ్ఞాన మార్గమగునని** చెప్పియున్నారు. ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతను ప్రజలకు బోధించు స్వామీజీయే దేవతలను ఆరాధిస్తున్నాడంటే అతనికి భగవద్గీతలోని సారాంశము అర్థమయినట్లు లేదు అని తెలియుచున్నది. దేవతలను పూజించువారు, వారి నామ స్మరణ చేయువారు తపస్వీకులు కావచ్చునుగానీ, యోగులు కాలేరు. యోగి అయిన వాడు మాత్రము సృష్ఠికర్త అయిన దేవున్ని చేరవచ్చునుగానీ, తపస్వీకులు గానీ, వేదాధ్యయణము చేయువారుగానీ, యజ్ఞములు చేయువారుగానీ దేవున్ని చేరలేరని దైవగ్రంథమయిన భగవద్గీత విశ్వరూప సందర్శన యోగము అను అధ్యాయమందు 48, 53 శ్లోకములలో చెప్పియున్నారు. దేవున్ని చేరుటకు యోగము తప్ప వేరు మార్గము లేదని తెలియుచున్నది. యోగములు **బ్రహ్మ, కర్మ, భక్తి యోగములు** అని మూడు యోగములు గలవు. దేవతలను పూజించడము ఈ మూడు యోగములకు సంబంధము లేదు. అటువంటప్పుడు దేవతారాధన వలన మనిషికి వచ్చే ప్రయోజనము ఏమీ లేదు. అందువలన **ఇందువు (జ్ఞాని) అయినవాడు యోగమును ఆచరిస్తాడు గానీ, దేవతా పూజలో ఉండడు.** బ్రహ్మవిద్యా శాస్త్రము వలన దేవతారాధన చేయువాడు ఇందువే కాడు అని చెప్పవచ్చును. మూడు దైవ గ్రంథములలో ఇదే విషయమునే చెప్పుచుంటే, భగవద్గీతను బోధించు స్వామీజీ దేవతారాధన చేయుచున్నాడు అంటే అతడు ప్రజల దృష్ఠిలో స్వామీజీ అయి యుండవచ్చును గానీ, దేవుని దృష్ఠిలో అజ్ఞానిగా ఉండును.

## 20) ప్రశ్న :- స్వామీజీలు గానీ, బోధకులు గానీ ధర్మములను గురించి బోధించడము లేదా?

**జవాబు :-** భూమిమీద పన్నెండు మతములుండగా అందులో పెద్దవి మరియు ముఖ్యమైనవి మూడు గలవు. అవియే హిందూ, క్రైస్థవ, ముస్లీమ్ మతములని చెప్పుచున్నారు. మూడు మతములవారు దేవుడు చెప్పిన మూడు దైవ గ్రంథములను ఇది మాది, అది మీదియని పంచుకొని చెప్పు కొంటున్నారు. వాస్తవముగా మూడు దైవ గ్రంథములు ఏ మతమునకు సంబంధించినవి కావు. అవి మానవులందరికీ ధర్మములను బోధించుటకు మూడు కాలములలో, మూడు దేశములలో బయటికి వచ్చాయి. అయితే ముస్లీమ్‌లు అంతిమ దైవగ్రంథమయిన **ఖుర్‌ఆన్‌**ను మా గ్రంథము అని అంటున్నారు. అట్లే క్రైస్థవులు ద్వితీయ దైవ గ్రంథమయిన **ఇంజీలు (బైబిలు)** గ్రంథమును మాది అని అంటున్నారు. చివరిగా మిగిలిన ప్రథమ దైవ గ్రంథమయిన **తౌరాత్ (భగవద్గీత)** గ్రంథమును హిందువులు మాది అంటున్నారు. మూడు మతములలో బోధకులు గలరు. అయినా మూడు గ్రంథములలోని **దైవ ధర్మములను (ఆత్మ ధర్మములను)** సరిగా తెలియక సరియైన భావమును చెప్పుకోలేక పోవుచున్నారు. దేవుడు చెప్పిన ధర్మములను వదలివేసి, ధర్మములు కాని వాటిని ధర్మములని చెప్పుకోవడము జరుగుచున్నది. తాము బోధకులుగా యున్నవారు ఎందరో దైవ గ్రంథములోని ధర్మములను తెలియలేకపోవడము వలన ప్రజలకు కూడా వారు బోధించు బోధలలో ధర్మములు లేకుండా పోవుచున్నవి. దానివలన బోధించు బోధకుల వద్ద, బోధలు వినే ప్రజల వద్ద **'ధర్మము'** అనునది లేకుండా పోయి భక్తి, ఆరాధనలు, ప్రార్థనలు మిగిలిపోయాయి. **ధర్మములు లేని ఏ ఆరాధన వలనా దేవుడు తెలియబడడు.** కావున సమాజములోని స్వామీజీలు గానీ, ప్రజలుగానీ అజ్ఞానము చేత దేవునికి దూరముగా

పోవుచున్నారు గానీ, దేవునికి దగ్గరగా పోవడము లేదు. బోధకులందరూ ధర్మములను జ్ఞానమును బోధించుచున్నామని కాలము గడుపుచున్నారు గానీ, దానివలన బోధకులకుగానీ, ప్రజలకు గానీ ఎటువంటి ప్రయోజనము లేదని చెప్పవచ్చును.

## 21) నేడు హిందువులకు వారి ధర్మములు తెలుసునా?

**జవాబు :-** హిందువు అను పదము మారిన పదముగా చెప్పుకొంటే 150 సంవత్సరముల పూర్వము నేడుగల **'హిందూ'** అను పదము **'ఇందూ'** అను పదముగా ఉండేది. ఇందూ అను పదము ఒక మతమును సూచించునది కాకుండా జ్ఞానమును సూచించుచూ జ్ఞానము అను అర్థముగా ఉండేది. ఇందువులు అని చెప్పుకొంటే జ్ఞానులు అని అర్థము. నేడు గల మూడు మతములలో గానీ లేక పన్నెండు మతములలో గానీ జ్ఞానము కల్గిన వారందరినీ ఇందువులు అనవచ్చును. **ఇందు** అనునది ఒక మతము కాదు జ్ఞానము. అన్ని మతముల జ్ఞానులను ఇందువులు అన్నప్పుడు మీ ప్రశ్న అన్ని మతముల జ్ఞానులకు ధర్మములు తెలుసునా? అని అడిగి నట్లున్నది. నీవు అడిగినది సంకుచితముగా ఒక మతమును గురించి అడగలేదు. ఈ ప్రశ్న అన్ని మతములకు సంబంధిత ప్రశ్నగా యుండుట వలన అన్ని మతములను కలిపి జవాబు చెప్పవలసి యున్నది.

ముఖ్యముగా ఉన్న మతములు మూడే అగుట వలన మూడు మతములను గురించి చెప్పితే అది అన్ని మతములకు సరిపోవును. మూడు మతములలో దేవునికి సంబంధించిన జ్ఞానమును తెలియు జ్ఞానులను చూస్తే వారిలో కొంతవరకు జ్ఞానమున్నా, పూర్తి దేవునికి సంబంధించిన ధర్మములు తెలియవు అని చెప్పవలసిందే. దేవుడు భూమిమీదికి వచ్చి ధర్మములను తెలియజేసినప్పుడు మాత్రము కొందరికి ధర్మములు తెలిసిన మాట వాస్తవమే. అయితే కాలము గడిచేకొద్దీ మనుషులలో ధర్మములు తెలియకుండా

పోవుచున్నవి. ధర్మముల స్థానములో అధర్మములు వచ్చి చేరుచున్నవి. ఉదాహరణకు వాస్తవముగా **'యజ్ఞములు' అధర్మముగా యున్నది. అట్లే వేదములను ఆధ్యాయణము చేయుట, ద్యానము (తపస్సు) చేయుట, దానములు చేయుట అధర్మములు** అని ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో తేల్చి భగవంతుడుగా వచ్చిన కృష్ణుడు చెప్పడమైనది. అంతకుముందు త్రేతాయుగములో దేవుడు రావణబ్రహ్మగా వచ్చినప్పుడు **"యజ్ఞములు అధర్మములని"** చెప్పడమైనది. దేవుడు మనిషి రూపములో వచ్చి, అధర్మములను ఖండించి ధర్మములను చెప్పిపోతే అప్పుడు కొంతకాలము అధర్మములు అణిగిపోయి ధర్మములు ఆచరణలోనికి వచ్చును. తర్వాత కొంతకాలమునకు క్రమేపీ ధర్మముల స్థానములో అధర్మములు వచ్చి చేరుచున్నవి.

ద్వాపర యుగము చివరిలో కృష్ణుడు భగవంతునిగా వచ్చి, ధర్మ సంస్థాపన చేసి, **"అధర్మముల వలన దేవుడు తెలియబడడు"** అని భగవద్గీత విశ్వరూప సందర్శన యోగము అను అధ్యాయమున 48, 53 శ్లోకములలో అధర్మము లను గురించి చెప్పడము జరిగినది. అంతేకాక ధర్మములయిన మూడు యోగములను గురించి కూడా చెప్పడమైనది. అప్పటి నుండి మూడు వేల సంవత్సరములు గడచిన తర్వాత, కలియుగములో ధర్మములు తెలియకుండా పోయి అధర్మములు ఆచరణకు వచ్చినప్పుడు దేవుడు మనిషిగా అవతరించి, తిరిగి ధర్మములను తన జ్ఞానములో చెప్పాడు. అప్పుడు కొంతమంది ధర్మములను తెలియగలిగి ఆచరించగా అధర్మముల స్థానము తగ్గిపోయినది. కృష్ణుని తర్వాత మూడు వేల సంవత్సరములకు అనగా ఇప్పటికి రెండువేల సంవత్సరముల పూర్వము ఏసుగా వచ్చిన అవతారములో ధర్మ సంస్థాపన జరిగినది. అప్పటి నుండి ఇప్పటికి రెండు వేల సంవత్సరములు గడిచినది కదా! ఇప్పుడు తిరిగి అధర్మములు

చెలరేగిపోయి ధర్మములకు స్థానము లేకుండా పోయినది. అధర్మవరులు ఎక్కువయిపోయారు. దానికి తోడు పూర్వమున్న నాలుగు అధర్మములకు తోడుగా **'మతము'** అను ఐదవ అధర్మము వచ్చి చేరినది. 'మతము' అను ఐదవ అధర్మము ముందున్న నాలుగు అధర్మములకంటే ఎక్కువ బలమైనదిగా ఉన్నది. పూర్వము నాలుగు అధర్మములుండగా, నేడు ఐదు అధర్మముల మధ్యలో ధర్మములకు స్థానము లేకుండా పోయినది. ధర్మములు ఇవి అని చెప్పలేని పరిస్థితి మనుషలలో ఏర్పడినది. అనగా ఏ మతములో గానీ ధర్మములనునవి తెలియకుండా పోయినవి. ఇట్టి పరిస్థితిలో దేవుడు తిరిగి తన ధర్మములను ప్రచారము చేయవలసి యున్నది. దేవుడు భగవంతుడను మనిషిగా వచ్చి ఇంతకు ముందు చెప్పిన వాటికంటే ఎక్కువగా చెప్పవలసి యున్నది. అట్లయితే గానీ ఈ కాలములో మనుషలకు దేవుని ధర్మములు తెలియునని అనుకొంటున్నాను.

**22) మీరు "దేవుని ధర్మములు తెలియకుండా పోయాయి అని వాటిని రక్షించుటకు దేవుడు అవతరిస్తాడని'' చెప్పచున్నారు కదా! నేడు చాలామంది మనుషులు గుంపులుగా తయారయి 'సంఘములు' అని పేరు పెట్టుకొని మేము హిందూ ధర్మములను రక్షిస్తాము అని చెప్పకొంటున్నారు కదా! ధర్మములను రక్షించువాడు దేవుడా? మనుషులా? అని అడుగుచున్నాము?**

**జవాబు :- "ధర్మములను రక్షించువాడు దేవుడేయని, దేవుడు తప్ప ధర్మములను ఎవరూ రక్షింపలేరని"** దేవుడే చెప్పినట్లు మూడు దైవగ్రంథములలో గలదు. **దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ ఇతర మానవునికి**

**తెలియదని,** అందువలన దేవుడే ధర్మములను రక్షించునని చెప్పియున్నారు. అయితే దేవుని మాటను కాదని కొందరు "ధర్మో రక్షతి రక్షితః" అను పదమును కనిపెట్టి చెప్పుచున్నారు. దాని ప్రకారము "ధర్మములను రక్షించితే ధర్మము మిమ్ములను రక్షించును" అని చెప్పుచున్నారు. దీని ప్రకారము మొదట మనుషులు ధర్మములను రక్షించవలెనని చెప్పుకోవడము జరుగు చున్నది. ధర్మములను రక్షింపవలెనని చెప్పడము మంచి మాటేగానీ, ముందు ధర్మములు ఫలానాయని తెలిసినప్పుడు కదా! మనిషి ధర్మములను రక్షించేది. ధర్మములు ఫలానాయని తెలియనప్పుడు మనిషి ఎలా రక్షించగలడు? నేడు ధర్మములకు గ్లాని ఏర్పడి అధర్మములే అంతటా యున్నప్పుడు, ధర్మములు తెలియకుండా కనుమరుగై పోయినప్పుడు, మనుషులు తమకు తెలిసిన వాటినే రక్షిస్తారు గానీ, తెలియని వాటిని రక్షించలేరు కదా! ప్రస్తుత కాలములో ధర్మములు తెలియకుండా పోయి, అధర్మములే అంతటా ఆచరింప బడుచున్నవి. అటువంటప్పుడు ధర్మ రక్షణ చేస్తామని గుంపుగా తయారై సంఘములను ఏర్పరచుకొన్నా, అధర్మములనే ధర్మములని తలచి, వాటినే వారు ఆచరించుచూ ధర్మములను రక్షించుచున్నామని చెప్పుకొంటున్నారు. వారు ఆచరించునవి ఇతరుల చేత ఆచరింపజేయునవి అధర్మములని వారికి నిజముగా తెలియదు. తాము ఏమి చేస్తున్నామో తెలియని స్థితిలో యున్న వారు ధర్మములను రక్షిస్తామనుకోవడము హాస్యాస్పదముగా యున్నది.

నేడు హిందూ ధర్మమును రక్షిస్తామను వారు అనేక గుంపులుగా ఏర్పడి తమ గుంపులను సంఘములని చెప్పుకొనుచూ, ఆ సంఘములకు పేర్లు పెట్టుకొని ఒకరుమించి మరొకరు మేము హిందూ ధర్మమును రక్షిస్తామంటున్నారు. అటువంటి హిందూ ధర్మ రక్షణ సంస్థలు లేక సంఘములు ఒక్క హిందూ మతములో దాదాపు ఇరువది వరకు గలవు. అందులో నాకు తెలిసినవి ఇలా గలవు.

1) హిందూ వాహిని

2) భజరంగదళ్

3) విశ్వహిందూ పరిషత్

4) ఆర్. యస్. యస్ (R.S.S)

5) పరుశురామ్ పరివార్

6) హిందూ జాగరణ సమితి (H.J.S)

7) శివశక్తి

8) హిందూ యువశక్తి దల్

9) హిందూ జనశక్తి

10) శివసేన

11) సమరసత సేవ ఫౌండేషన్

12) హిందూ ధర్మాచార్య ప్రతిష్టాన్

13) రాష్ట్రీయ హిందూ సేన

14) హిందూ ప్రస్థానము

15) విశ్వ ధర్మ పరిరక్షణ

16) ప్రజా హిందూ దళము

17) హిందూ రక్షక దళ్

18) హిందూ జాగృతి

19) హిందూ చైతన్య సమితి

ఈ విధమైన పేర్లతో కొన్ని హిందూ సంఘములు పని చేయుచుండగా, భవిష్యత్తులో ఇంకా కొన్ని సంఘములు తయారు కాగలవు. ఒక విధముగా వీరందరి ఉద్దేశ్యము మంచిదే. హిందూ ధర్మమును రక్షించాలనునది మంచి ఉద్దేశ్యమే అయినా ఆ ఉద్దేశ్యమును అనుసరించి పని చేయలేక పోతున్నాయని చెప్పవచ్చును. దీనికి అంతటికీ కారణము 'హిందూ ధర్మములు ఫలానాయని తెలియకపోవడమే' యని చెప్పవచ్చును. వీటిలో కొన్ని సంఘములవారు తటస్థముగా ఉండగా, కొన్ని సంఘముల వారు చురుకుగా పని చేయుచున్నారు. చురుకుగా పని చేయువారు హిందూ ధర్మమును రక్షించుచున్నారా? యని ప్రశ్నించుకొని చూస్తే, తెలియని ధర్మమును ఎలా రక్షించగలరు? అందువలన వారు రక్షించేది వారికి తెలిసిన అధర్మములను మాత్రమే యని తెలియుచున్నది. అధర్మములను రక్షిస్తూ, ఆచరించుట వలన అధర్మములకు బలము చేకూరుచున్నది. దానివలన అసలయిన ధర్మములకు ఇంకా హాని చేసినవారమగుచున్నాము అని వారికి తెలియకుండా పోయినది. **"కొట్టబోయి కొట్టించుకొన్న"** సామెతవలె ధర్మములను రక్షించను బోయి ధర్మములను భక్షించినట్లయినది. దీనినిబట్టి హిందూ **ధర్మములను మనుషులు రక్షించలేరు, రక్షించువాడు దేవుడే**యని తెలిసిపోవుచున్నది.

## 23) ప్రశ్న :- మీ లెక్కలో హిందూ ధర్మములను ఉద్ధరించువాడు ఎవరు?

**జవాబు :-** ఈ ప్రశ్నకు సూటిగా సమాధానమును చెప్పితే **ధర్మములను రక్షించువాడు దేవుడు**యని చెప్పక తప్పదు. ఈ మాట చెప్పుటకు ప్రథమ దైవగ్రంథములో ఆధారము గలదు. భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయమందు 7, 8 శ్లోకములను చూడుము.

శ్లో॥ 7 : యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!।
అభ్యుత్థానమ ధర్మస్య తదాత్మానం సృజామ్యహామ్॥

శ్లో॥ 8 : పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

**భావము :- "ఎప్పుడెప్పుడు ధర్మమునకు ముప్పు గలిగి భూమిమీద అధర్మము వృద్ధి చెందునో అప్పుడు నేను భూమిమీద అవతరించి సాధుజనులను వృద్ధి చేయుట, అధర్మవరులను లేకుండా చేయుట పనిగా పెట్టుకొని దాని కొరకు ప్రతి యుగములో ధర్మములను తిరిగి తెలియజేయుచుందును."**

ఈ విధముగా దేవుడు ప్రథమ దైవగ్రంథములో తెలియజేశాడు. **"భూమిమీద ధర్మములు తెలియకుండా పోయినప్పుడు, ధర్మములను తెలియ జేయు నిమిత్తము నేనే వస్తానని"** దేవుడే చెప్పియున్నాడు. దానిప్రకారము దేవుడు మనుషులలో సాధారణ మనిషిగా వచ్చి, తనను ఎవరూ గుర్తించనట్లు యుండి, తన ధర్మములను తాను తెలిపిపోవును. దేవుడు వచ్చి స్వయముగా ధర్మములను తెలిపినా, ఆయన ఎక్కడా గుర్తింపబడడు. తాను ధర్మములను తెలియజేయుదునని గానీ, ధర్మములను రక్షింతునని గానీ, ఎక్కడా తెలుపడు. తాను ఏ సంఘమును స్థాపించి గుర్తింపు పొందలేదు. తాను దొంగవలె వచ్చి దొంగవలె పోయినట్లు, దేవుడు భూమిమీదికి ఎవరికీ తెలియకుండా వచ్చి, ఎవరికీ తెలియకుండా పోవుచున్నాడు. దేవుడు మనిషిగా వచ్చి ధర్మములను విపులముగా తెలిపి పోయినా, మనుషులు వాటిని సరిగా అర్థము చేసుకోలేని స్థితిలో యున్నారు. అటువంటిది సాధారణ మనుషులు చెప్పితే మనుషులకు అర్థమగునా? అర్థము కాదు.

దేవుడు స్వయముగా చెప్పినా గ్రహించుకొను శక్తిలేని మనుషులు మేము ధర్మములను ఉద్ధరిస్తామయని అనడము, రక్షిస్తాము అని చెప్పడము

మనిషిలోని అహము తప్ప ఏమీ కాదు. మనిషి ధర్మములను ఉద్ధరించు స్థోమతలో యుంటే దేవుడు భూమిమీదికి రావలసిన పనే లేదు. నేడు 'హిందూ మతము' అను వారికి ప్రత్యేకముగా **భగవద్గీత** గలదని చెప్పు కొంటున్నారు. ఆ భగవద్గీతలో ఇందూ ధర్మములను గురించి బాగా బోధించినారు. అందులో **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని దేవుడు చెప్పిన మాటను వ్యతిరేఖించినట్లు, మేమే ధర్మములను ఉద్ధరిస్తాము నీవు రావలసిన పని లేదు అని చెప్పినట్లున్నది. **"మనిషి ఏమీ చేయలేడు, మనిషిని ఆడించునది నేనేయని"** దేవుడు గ్రంథములో చెప్పియుండగా, నేనే చేస్తానని మనిషి అనడము ధర్మవిరుద్ధము కాదా! నేడు ధర్మములు అడుగంటిపోయి అధర్మములు రాజ్యమేలుచుండగా, అధర్మములను పట్టుకొని ధర్మములలాగా భావించి వాటినే పెద్దగా చెప్పు కొనుచూ, ఒకవైపు అధర్మ ఆచరణ చేస్తూ, నేను ధర్మములను రక్షిస్తానని చెప్పడము విడ్డూరముగా యున్నది.

ఉదాహరణకు చెప్పితే మనిషి యజ్ఞములను ఆచరించుచూ అది ధర్మాచరణ అని అంటున్నాడు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో **"యజ్ఞముల వలన దేవుడు తెలియబడుట శక్యము కాదు"** అని భగవంతుడుగా వచ్చిన దేవుడు చెప్పియున్నాడు. అంతేకాక అటువంటివి నాలుగు ఆచరణలు కలవని, వాటి వలన దేవుడు తెలియబడడని చెప్పడము జరిగినది. దేవుడు తన గ్రంథములో ఏవి వద్దని చెప్పాడో వాటినే మనిషి చేయుచున్నాడు. **"దేవుడు తెలియబడడు"** అని చెప్పినవి అధర్మములని మనిషి గ్రహించలేకపోయాడు. అధర్మ ఆచరణగా యజ్ఞ ఆచరణ చేయుచున్నాడు. **"యజ్ఞము శరీరములో జరుగుచున్నదనీ, శరీరములో జరుగు యజ్ఞములకు నేనే అధిపతినని"** చెప్పుచూ, భగవద్గీతలో అక్షర

పరబ్రహ్మయోగమున నాల్గవ శ్లోకమున "అధి యజ్ఞోహమే వాత్ర దేహె దేహభృతాం వర" అని చెప్పాడు. దీనిప్రకారము **యజ్ఞము** అనునది దేహములో జరుగుచుండగా, బయట యజ్ఞములను చేయడము అధర్మము కాదా! అంతేకాక భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున **"యజ్ఞములు రెండు రకములనీ, అందులో ఒకటి ద్రవ్య యజ్ఞము అనీ, రెండవది జ్ఞానయజ్ఞమనీ, ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞమే శ్రేష్టమైనదని"** చెప్పుచూ జ్ఞానయోగమను అధ్యాయమున 33వ శ్లోకములో ఈ విధముగా చెప్పాడు చూడండి.

శ్లో॥ 33 : శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥

ఈ శ్లోకములో **"బయట జరుగు ద్రవ్యముల యజ్ఞముకంటే శరీరము లోపల జరుగు జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమని"** చెప్పియున్నాడు కదా! దీనిప్రకారము శరీరములో జ్ఞానమను అగ్నితో కర్మలను కాల్చు యజ్ఞమును చేయక, శరీరము బయట ద్రవ్యములను కాల్చు అగ్నితో యజ్ఞములను చేయడము దేవుని మాటను ధిక్కరించినట్లు కాదా! ఈ విధముగా అధర్మ ఆచరణగా బాహ్య యజ్ఞములను చేయుచూ, దానిని ధర్మమని చెప్పడము ధర్మ రక్షణ అగుతుందా? **యజ్ఞ ఆచరణ అధర్మమని త్రేతా యుగమున రావణ బ్రహ్మ చెప్పడమేకాక, ఎక్కడ యజ్ఞ ఆచరణ జరుగుచున్నదో అక్కడికి పోయి యజ్ఞములను ధ్వంసము చేసి, యజ్ఞములను చేయువారిని దండించడము, శిక్షించడము జరిగినది.** ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో యజ్ఞముల నిజ తత్త్వమును చెప్పుచూ **బాహ్య యజ్ఞములు అధర్మములని, అంతర్ యజ్ఞములు ధర్మములని చెప్పడమైనది.** మిగతా రెండు దైవగ్రంథములలో యజ్ఞములను ధర్మములని ఎక్కడా చెప్పలేదు.

అయినా త్రేతాయుగములోని రావణబ్రహ్మ మాటనుగానీ, ద్వాపర యుగము నాటి కృష్ణుని మాటను గానీ లెక్కచేయక ఇదే ధర్మమన్నట్లు యజ్ఞ ఆచరణ చేయుచున్నారు. ఇది మంచిది కాదు, అధర్మాచరణయని మేము యజ్ఞములను చేయవద్దండి అని చెప్పితే, మమ్ములను హిందువే కాదు అని కొందరు అంటున్నారు. ఇందూ ధర్మములను తెలియనివారు 'ఇందూ'ను 'హిందూ' అని పలుకుచూ, తమది 'జ్ఞానమా, అజ్ఞానమా' అని తెలియని వారు మమ్ములను విమర్శించడము, సూర్యుని మీద ఉమ్మినట్లుంటుంది అని తెలియవలెను.

ముందు మీరు ఏ స్థితిలో యున్నారో చూచుకోండి. కాషాయ దుస్తులను ధరించి, కషాయము అంటే ఏమో తెలియకపోతే అది బాహ్య వేషమే అయినట్లు, మేము హిందూ ధర్మములను రక్షిస్తాము అని అవి ఏవో తెలియక అధర్మములను ఆసరాగా చేసుకొని మాట్లాడువారు ఇందువులా? యని నేను ప్రశ్నిస్తున్నాను. మిగతా పదకొండు మతములలో గానీ, ప్రక్కనే కనిపించు క్రైస్థవ మతములోగానీ, ముస్లీమ్ మతములోగానీ ఎక్కడా వారి మత రక్షణ సంస్థలు లేవు. వారు వారి జ్ఞానమును ప్రచారము చేయు చున్నారు. వారి గ్రంథములలో చెప్పినట్లు నడుచుకొనుచున్నారు. ఎవరూ వారి గ్రంథములలోని ఒక్క వాక్యమును కూడా అతిక్రమించి నడువలేదు. హిందూమతములో భగవద్గీత ప్రకారము నడువకుండా, భగవద్గీతలో చెప్పిన దానికి విరుద్ధముగా ప్రవర్తించుచూ, మేము ధర్మ రక్షకులము అని సంఘములను స్థాపించుకోవడము అజ్ఞానము కాదా! నేడున్న హిందూ సంస్థలలో కొన్ని పెద్ద సంస్థలు ఉండగా, కొన్ని ఒకడు లేక ఇద్దరికే పరిమితముగా యున్న సంఘములు కూడా కలవు. పనీ పాట లేని కొందరు ఏదో ఒక పేరు పెట్టుకొని నేను ఈ సంఘమునకు పెద్దయనీ, రాష్ట్ర ప్రెసిడెంటునని చెప్పుకోవడము జరుగుచున్నది. తీరా ఆ

సంఘమును చూస్తే వాడు తప్ప వాని వెనుక ఒక్కడు కూడా లేని సంఘములు కొన్ని ఉన్నాయి.

కొందరు అదే పనిగా మాది ఫలానా సంఘము అని పేరు పెట్టుకొని ఇతర స్వామీజీలను బెదిరించుచూ, మీరు సరైన హిందువులు కాదని బెదిరించి వారితో డబ్బులు లాగుచున్నారు. కొన్ని ప్రాంతములలో వ్యాపారస్థులను, పారిశ్రామికవేత్తలను మేము మావోయిస్టులమని చెప్పుచూ మీలో ఈ లోపములున్నవి యని బెదిరించి డబ్బులు అడిగి వారినుండి వసూల్లు చేసినట్లు, నేడు ఆధ్యాత్మిక స్వాములపట్ల నక్సలైట్లుగా నేటి హిందూసంస్థలు కొన్ని బెదిరింపులకు పాల్పడుచూ ధనార్జన చేయుచున్నవి. నాకు తెలిసినంతలో ఒక 'ధర్మరక్షణ దళము' అని పేరు పెట్టుకొన్న వారికి ఇందూ ధర్మములేవో తెలియవు. అంతేకాకుండా ఆ పేరు పెట్టుకొన్న సంఘములోని వారు పదిమంది మాత్రమే ఉన్నారు. ఆ పదిమంది 20 నుండి 25 సంవత్సరపు యువకులు. ఆ యువకులు ఒక గుంపుగా చేరి, రౌడీలుగా ప్రవర్తించుచూ పని చేయకుండా బ్రతకాలని చూచేవారు. వీధి రౌడీలుగా ప్రవర్తించు వారు తెలివిగా ఒక 'హిందూ ధర్మముల రక్షణ' అను పేరుతో చెలామణి అగుచూ, ఆధ్యాత్మిక స్వాములకు లేఖలు వ్రాసి, మీరు హిందూ ధర్మములను బోధించడము లేదు, ఇతర మతముల జ్ఞానమును చెప్పుచున్నారు. మీరు హిందూ మత ముసుగులో యున్న క్రైస్థవులనియో లేక ముస్లీమ్‌లనియో బెదిరించెడివారు. 'హిందూ రక్షణ దల్' అను పేరుతో కొంత డబ్బున్న స్వామీజీని బెదిరించెడివారు. మీ ఆశ్రమము మీద దాడి చేస్తామనియో, నీవు ఇతర మతముల నుండి తీసుకొన్న డబ్బును గురించి అందరికీ చెప్పి, నీ ఆశ్రమమును మూసివేస్తామని బెదిరించడముతో స్వామీజీలుగా యున్నవారు ఎవరయినా గొడవలకు దూరముగా ఉండవలెనని భయపడుట సహజము. తనకు తెలిసిన

జ్ఞానమును చెప్పుచూ, భగవద్గీతనే బోధించు స్వామీజీ వారు అడిగిన డబ్బును ఇచ్చి, వారి నుండి దూరముగా ఉండవలెననుకొనుట సహజమే. హిందూ జ్ఞానమే బోధించు హిందువుల స్వాములే వీరికి ఎరలుగా యుండుట వలన వారు అడిగిన డబ్బు వారికి అందేది.

ఈ విధముగా వారు హిందూ స్వాములనే మీరు అన్య మత బోధ చేయుచున్నారని ఆరోపించడము వలన హిందూ స్వాములు కూడా కొంత భయపడేవారు. మేము 'హిందూ రక్షణ దళము' అని వారు చెప్పగానే అదేదో సైన్యము అనుకొని స్వాములు భయపడేవారు. వారు పదిమంది మాత్రమే ఉన్నారని ఎవరికీ తెలియదు. హిందువులలో కొన్ని పెద్ద సంస్థలు విశ్వహిందూ పరిషత్, శివసేన, ఆర్.యస్.యస్, భజరంగదల్ మొదలగునవి గలవు. ఐదు ఆరు పెద్ద సంస్థలు హిందువులు ఇతర మతములలోనికి పోకుండా చూచుకొనుటకు మాత్రము గలవు. పెద్ద సంస్థలుగా యున్నవారు ఇతర హిందూ స్వామీజీలను బెదిరించడము లేదు. అయినా అవికాక మిగతా అనేక పేర్లతో గల కొన్ని సంస్థలు వేరు వేరు పేర్లతో చెలామణి అగుచూ, వారికి ఏమాత్రము హిందూ ధర్మములు తెలియకున్నా, హిందు రక్షకులమని చెప్పుకొనుచూ, హిందువులనే బెదిరించి హిందూ స్వాముల నుండి అక్రమముగా డబ్బును పిండుకొంటున్నారు. ఇటువంటి దొంగ హిందూ సంఘముల మీద ఎవరికీ అజమాయిషీ లేదు. పోలీస్ వారు కూడా మత సంబంధ సంఘముల మీద దృష్ఠి పెట్టరు. 'మతము' అంటే సున్నితమైనదని పోలీస్ వారు కూడా పట్టించుకోకపోవడముతో అక్రమముగా హిందూ రక్షణ పేరుతో తయారయిన వారు, హిందూ స్వాముల మీదనే దాడులు చేయుచూ, కొన్నిచోట్ల బెదిరించుచూ, హిందువులనే నాశనము చేయు చున్నారు. ఇటువంటి చీడ పురుగుల వలన హిందూ సమాజమే క్షీణించి పోవుచున్నది.

హిందూ జ్ఞానము తెలియదు, హిందూ ధర్మములు ఏవో, ఎన్ని యున్నాయో తెలియదు. అటువంటి వారు హిందూ రక్షకులా? హిందూ ధర్మ పరిరక్షకులా? అనేక ప్రాంతములలో తయారయిన చిన్న చిన్న హిందూ సంఘములు హిందువులను ఉద్ధరించడము లేదు. అటువంటి వారు హిందూ ధర్మమును నాశనము చేయుచూ, అధర్మముల ప్రకారము ప్రవర్తించు చున్నారు. ఒకడు ఒక గుంపును తయారు చేసుకొని దానికి నాయకుడుగా ఉంటూ ఒక 'హిందూ రక్షణ' పేరుతో ఒక సంఘము పేరు పెట్టుకొని, హిందూ మతములో సక్రమముగా యున్న స్వామీజీలను బెదిరించుచున్నారు. బెదిరింపులకు భయపడకపోతే పదిమంది ఇంకా కొంతమంది కిరాయి మనుషులను తీసుకొని పోయి వారి మాట వినని స్వామీజీల మీద మీరు అన్యమత ప్రచారము చేయుచున్నారని ఆరోపణతో దాడులు చేయుచున్నారు. అలా దాడులు చేస్తే ఏ స్వామీజీ అయినా భయపడక తప్పదు కదా! దానివలన హిందూ ధర్మములు నాశనముకాక అభివృద్ధి ఎలా కాగలవు?

ఇతర మతములలో లేని రక్షణ సంస్థలు ఒక్క హిందూ మతములోనే ఎందుకు వచ్చాయి? అని ఎవరూ ప్రశ్నించడము లేదు. హిందువులు ఇతర మతములలోనికి పోవుచున్నారు. అందువలన హిందూ మతము క్షీణించి పోవుచున్నదనీ, దాని కొరకే హిందూ రక్షణ సంస్థలని కొందరు చెప్పుచున్నారు. ఇతర మతముల వారు వారి జ్ఞానమును ప్రచారము చేయుచున్నారు. కావున చాలామంది హిందువులు ఇతర మతములలోనికి పోవడము జరిగినది. అలా వారు ఇతర మతములలోనికి పోవడానికి ముఖ్య కారణము హిందూ మతములో యున్న **"కుల వివక్ష"** మొదటి కారణము కాగా, హిందూ మతములో **దేవుని జ్ఞానమును భగవద్గీత ప్రకారము బోధించక పోవడము** రెండవ కారణముగా యున్నది. జ్ఞానము మీద ఆసక్తి గలవారు హిందూ మతములో జ్ఞానము లభించదు, పూజలు

తప్పు ఏమీ లేదని విసిగి ఇతర మతములలోనికి చాలామంది పోవడము జరిగినది.

నేడు హిందూ రక్షణ సంస్థలుగా పేరు పెట్టుకొన్న వారు ఎవరయినా భగవద్గీతా జ్ఞానమును ప్రజలకు బోధిస్తున్నారా? ఎంతసేపూ ఇతర మతముల మీద ద్వేషమును ప్రజలకు నూరిపోయడము తప్ప, మన మతములోని జ్ఞానమును ఎంతవరకు బోధిస్తున్నామని కొద్దిగా అయినా ఆలోచిస్తున్నారా? నా అనుభవములో మేము స్వచ్ఛమయిన హిందూ ధర్మములను బోధించుచూ వంద గ్రంథములను శాస్త్రబద్ధమైన జ్ఞానముతో వ్రాశాము. అద్వైత, విశిష్టా ద్వైత, ద్వైత సిద్ధాంతములలాగా **త్రైత సిద్ధాంతము**ను ప్రతిపాదించి ఒకే సిద్ధాంతము మీద వంద గ్రంథములను వ్రాశాము. ఇందూ జ్ఞానము, ఇందూ ధర్మము గొప్పదని అన్ని మతముల వారిని ఒప్పించగలిగాము. వారికి కూడా వారి ధర్మములను తెలియజేసి, ఇవి ఇందూ ధర్మములని తెలియజేశాము. మమ్ములను మూడు మతములవారు గౌరవించుచున్నారు. అయితే కొన్ని హిందూ సంస్థలకు మేము అన్యమత ప్రచారకులుగా కనిపిస్తున్నాము. వారి బెదిరింపులకు లొంగలేదని దాడులు కూడా చేశారు. అయినా భయపడలేదని సోషల్ మీడియా ఫేస్‌బుక్‌లో అనేక రకమైన ఆరోపణలు చేయుచూ, మేము హిందువులము కాము అని ప్రచారము నేటికీ చేయుచున్నారు. వారు ఎంత దుష్ప్రచారము చేసినా మేము ఏమాత్రము పట్టించుకోవడము లేదు. నేను చెప్పునది హిందూ జ్ఞానము అయినందున అనేకమంది హిందువులు నన్ను గౌరవించునప్పుడు ప్రక్కన కుక్కలవలె మొరుగువారిని పట్టించుకోనవసరము లేదు.

## 24) ప్రశ్న :- మీరు రామున్ని దేవుడు కాదన్నారని వారు ఫేస్‌బుక్‌లో పోస్టులు పెట్టుచున్నారు కదా! దానికి మీరు ఏమంటారు?

**జవాబు :-** నేను చెప్పునది ఆధ్యాత్మికము. ఆత్మకు సంబంధించిన విషయములను చెప్పడమే నా పనిగానీ రామునితో నాకు పని లేదు. ఈ మధ్యకాలములో **"ద్రావిడ బ్రాహ్మణ"** అను గ్రంథమును వ్రాసినప్పుడు సందార్భనుసారము **జరిగిన చరిత్ర**ను చెప్పుచూ 'రాముడు వాలిని చంపాడు' అని వ్రాశాము. అది అందరికీ తెలిసిన చరిత్ర కావున ఆ మాటలో తప్పు లేదు కదా! అన్ని రామాయణములలో రాముడు వాలిని చంపినది ఉన్న విషయమే కదా! తర్వాత **"రావణ బ్రహ్మ"** గ్రంథము వ్రాసినప్పుడు అందులో 'రాముడు రావణున్ని చంపాడు' అని వ్రాశాము. అది కూడా చరిత్రలోని విషయమే. అందరూ చెప్పు విషయమే. అంతేగానీ రామున్ని దేవుడని గానీ, దేవుడు కాదు అనిగానీ నేను ఎక్కడా వ్రాయలేదు. అలా వ్రాసే అవసరము నాకు లేదు. రాముడు ధర్మవరుడని గానీ, అధర్మవరుడని గానీ ఎక్కడా వ్రాయలేదు. జరిగిన చరిత్రను వ్రాశాము తప్ప, రాముని ప్రస్థావన ఏమీలేదు. అయినా అదే పనిగా ఆరోపణ చేయవలెనని అనుకొనువారు ఉన్నవి కాకపోయినా, లేనివాటిని కల్పించి చెప్పడము పరిపాటిగా యున్నది.

ఒక విషయమును గమనించండి. నేను ఒక సందర్భములో మాట్లాడుచూ "నేను స్నానము చేయనిదే గుడికి పోను ఏ దేవునికి మ్రొక్కను" అని అన్నాను అనుకోండి. దానినే గ్రంథములో కూడా వ్రాశాను అనుకోండి. అప్పుడు నన్ను తప్పుగా ఆరోపణ చేయువారు "నేను స్నానము చేయనిదే" అను మాటను తీసివేసి "నేను గుడికి పోను ఏ దేవునికి మ్రొక్కను" అని మాత్రము చూపిస్తే అది తప్పుగానే కనిపించును, నేను నాస్తికునిగానే కనిపించవచ్చును. "నేను స్నానము చేయనిదే" అనుమాటను చెప్పకుండా "గుడికి పోను, దేవునికి మ్రొక్కను" అని మాత్రము చెప్పినట్లు చూపించడము అదే పనిగా దుష్ప్రచారము చేసినట్లు కాదా! అదే విధముగా కొందరు

అల్లరి మూకలు యువకులుగా యుండి, అన్ని దురలవాట్లకు అలవాటు పడినవారు ఇతరులను బ్లాక్‌మెయిల్ చేసి, వారి పరువు తీస్తే సులభముగా డబ్బులు వస్తాయనుకొనువారు ఏదో ఒక 'ధర్మరక్షణ సంఘము' అని పేరు పెట్టుకొని, ఆరోపణలు చేయడము నేడు అక్కడక్కడా జరుగుచున్నది. అలాంటివారు నన్ను తప్పుగా ఆరోపించు నిమిత్తము అదే పనిగా నేను రామున్ని దేవుడుకాడు యని చెప్పినట్లు ప్రచారము చేయుచున్నారు తప్ప, అందులో ఏమాత్రము సత్యము లేదు. నేను ఒక సిద్ధాంతకర్తను. అందరివలె బోధకుడను కాను. నా సిద్ధాంతమును గురించి నేను చెప్పుచుందును తప్ప రామున్ని గురించి దేవుడనిగానీ, దేవుడు కాదు అనిగానీ చెప్పనవసరము లేదు. నేను అలా చెప్పాననడము పూర్తి అసత్యము. నేను అలా వ్రాసియుంటే నేను వ్రాసిన వంద (100) గ్రంథములలో ఎక్కడయినా చూపి నిరూపించ వచ్చును. అలా వ్రాసే అవసరము నాకు లేదు. కావున అది నన్ను బ్లాక్‌మెయిల్ చేయాలనుకోవడము తప్ప వేరు ఉద్దేశ్యము ఏమీ లేదు. ప్రతీ నెల దాదాపు ఇరవై వేలమంది నా భక్తులు వచ్చి, నా ఉపన్యాసమును వినిపోవుచుందురు. ఇప్పటికి నా భక్తులు లక్షకు పైబడి యున్నారు. రాబోయే కాలములో ఇంకా ఎక్కువ కాగలరు. వారందరికీ కనిపించని లోపము 'ధర్మ రక్షణ సంఘము' అను పేరు పెట్టుకొన్న త్రాగుబోతులకు కనిపించింది అనడము విచిత్రము కాదా!

మా బోధల వలన ఇందుత్వము (హిందుత్వము) బలపడి, అందరూ జ్ఞానులు అగుటకు అవకాశము గలదు. మా బోధల వలన ఇతర మతముల వారు వారి మతములలో కూడా మేము చెప్పు జ్ఞానము గలదని, భగవద్గీత జ్ఞానము అన్ని మతములలో కూడా ఉన్నదని తెలిసి, అన్ని మతముల వారు ఐకమత్యముగా ఉండుటకు, మతసామరస్యముగా ప్రవర్తించుటకు అవకాశము గలదు. మేము చెప్పు జ్ఞానము వలన మా **"త్రైత సిద్ధాంతము"**

భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయమున 16, 17వ శ్లోకములందు **క్షర, అక్షర, పురుషోత్తములు** గా యున్నదని హిందువులు గ్రహించుచున్నారు. అట్లే ఇంజీలు (బైబిలు) గ్రంథములో మత్తయి సువార్తలో 28వ అధ్యాయమున 19వ వచనమున **తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ** యను పేరుతో భగవద్గీతలోని త్రైత సిద్ధాంతము కలదని గ్రహించుచున్నారు. అట్లే ఖుర్‌ఆన్ గ్రంథమున సూరా 50, ఆయత్ 21లో **త్రోలబడేవాడు, త్రోలేవాడు, సాక్షిగా చూచేవాడు** అని భగవద్గీతలో మరియు బైబిలులో చెప్పిన ముగ్గురు పురుషుల త్రైత సిద్ధాంతము గలదని గ్రహించుచున్నారు. అలా గ్రహించిన వారు అన్ని మతములలో ఒకే జ్ఞానమున్నదని తెలిసి, మత సామరస్యమును ప్రదర్శించుచున్నారు. హిందూ ధర్మరక్షణ సంస్థలని పేరు పెట్టుకొన్నవారు ఇతర మతములను దూషించడము, ద్వేషించడము వలన మత కలహాలు ఏర్పడుచున్నవి. ధర్మ రక్షణ యనుచూ అన్యమతములను వేరుగా చెప్పుచూ, వారి దేవుడు వేరు, మా దేవుడు వేరని చెప్పుట వలన మత కలహాలు వస్తున్నవి. మా బోధల వలన అందరి దేవుడు ఒక్కడే, అన్ని మతముల జ్ఞానము ఒక్కటేయని తెలిసి అందరూ ఐకమత్యముగా, ప్రేమగా ఉండుట మంచిదో, కాదో ఆలోచించండి. మత రక్షణ అను పేరుగల్గిన యువ సంఘముల వలన, అధర్మములను, అజ్ఞానమును ప్రేరేపించు మూర్ఖ సముదాయము వలన, ఇతర మతములను దూషించి సమాజములో గుర్తింపు తెచ్చుకోవాలనుకొను అనామకుల వలన, ఏమాత్రము ధర్మములను తెలియని అధర్ముల వలన, సమ సమాజముగా యున్న మనుషులలో **మతము** అను చిచ్చును రేపి, సమాజములో హింసను రేకిత్తించు వారివలన మనుషులందరికీ, అన్ని మతముల వారికీ ప్రమాదము కల్గుచున్నది. ఒకచోట మతము అను పేరుతో చిచ్చురేపి, చిచ్చు పెట్టినవారు హాయిగా ఇంటిలో ఉండగా, ఆ

చిచ్చుకు అమాయక ప్రజలు బలియగుచున్నారు. అందువలన ఇకనైనా చిల్లరగా పుట్టుకొచ్చిన 'ధర్మ రక్షణ' అను వారికి హిందువులు దూరముగా ఉండండి.

(ఒకప్పుడు జరిగిన మత ఘర్షణలలో ఘోరముగా దెబ్బతిని, చావక బ్రతికి యుండి బాధను అనుభవించు ఒక హిందువు తన బాధను ఇలా వెలిబుచ్చాడు. ఆ విషయమును క్రింద పొందుపరుస్తున్నాము చూడండి.)



## మనము హిందువులమా?



పేరుకు మనము భారతీయులమే అయినా కొందరు భారతీయులుగా బ్రతుకుతుంటే, కొందరు మాత్రము ఆ పేరుకు ఏమాత్రము సరిపోకుండా బ్రతుకుచున్నారు. వివరముగా చెప్పితే అనేక మతములు, అనేక జాతులతో కూడుకొని ఎటువంటి భేదము లేకుండా బ్రతుకుతున్నది భారతీయ సమాజము. అటువంటి వారినే భారతీయులనాలి. కానీ కొందరు భారతీయులుగా బ్రతకడము లేదు. మత భేదములతో, జాతి భేదములతో నాది ఫలానా మతము, నాది ఫలానా వర్గము అని గొప్పగా చెప్పుకొని బ్రతుకుచున్నారు. మతమను ముసుగును అనేక పేర్లతో తగిలించుకొని, సాటి సమాజమునూ, అందులోని అమాయక ప్రజలనూ బలి పశువులను చేయుచున్నారు. ఏ మతద్వేషము లేని ప్రజలు ఎందరో మతఛాందసవాదుల కారణముగా ప్రాణాలను పోగొట్టుకున్నారు. మరెందరో కాళ్ళను, చేతులను, కళ్ళను పోగొట్టుకొని బాధపడుచూ బ్రతుకుచున్నారు. తాము అలా మారుటకు ఈ మధ్య కాలములో గోకుల్‌చాట్‌లోనూ, లుంబినీ పార్కులోనూ క్షతగాత్రులై, ఏ పనీ చేయలేని స్థితిలో ఇతరుల మీద ఆధారపడి బ్రతుకుచున్న వారిలో కొందరిని కలిసి మాట్లాడితే, వారి జీవితాలు ఈ విధముగా మారిపోవుటకు

కారణమైన వారిమీద, వారు వెలిబుచ్చిన అభిప్రాయమును వింటే మనము **'మతము'** అను మత్తులో ఎంత అనాగరికముగా మారిపోయామో అర్థమగు చున్నది. గోకుల్‌చాట్ వద్ద బాంబు పేలుడులో వెన్నెముక దెబ్బతిని మంచములో కదలలేకయున్న ఒక హిందువు ఇలా అంటున్నాడు. నేను ఎవరికీ శత్రువును కాను, నాకు ఎవరూ శత్రువులు లేరు. కానీ నేను, నాలాంటి అమాయకులెందరో బాంబు పేలుడులో బలియైపోయారు. బాంబు పెట్టింది ముస్లీమ్‌లే, అయినా వారు క్రూరంగా మారిపోయి వారికి ఏ విధముగాను శత్రువులు కాని అమాయక ప్రజలను బలికొనునట్లు ప్రేరేపణ చేసినది హిందువులలోని కొంతమందే? ఈ దినము కొందరు హిందువులు, వారు నాయకులుగా కనిపించుటకు 'మత రక్షణ' అని పేరు పెట్టుకొని ఇతర మతస్థులను నీచముగా మాట్లాడడము వలనా, ఇతర మతస్థుల మీద శత్రు భావము చూపడము వలనా, మేము ఈ దినము ఇలా అయి పోయాము. పాపము చేసింది హిందూతములోని పరిషత్‌లు, దళ్‌లు, సేనలు, సేవకులు అనువారు. అనుభవించేది అమాయకులమైన మేము. మేము ఈ విధముగా బాధలను అనుభవించుటకు కారణము బాంబు పెట్టిన ముస్లీమ్‌లు కాదు! వారినలా ప్రేరేపించిన హిందూ సంస్థలు. దీనినిబట్టి మాకు నిజమైన శత్రువులు హిందూ సంస్థలే. నేను ఒక్కడినే ఈ మాట అనడము లేదు. అన్నిటినీ ఆలోచించిన ప్రతీ హిందువూ వీరిని ద్వేషిస్తున్నాడు. హిందువులు ఎందరో తమను ద్వేషిస్తున్నారని తెలిసినా, మేమే నిజమైన దేశభక్తులమనీ, మా వలననే హిందూ మతము రక్షింప బడుతున్నదని చెప్పడము విడ్డూరము కాదా!

దేశానికి స్వాతంత్ర్యమును తెచ్చి యిచ్చి జాతిపిత అని పేరుగాంచిన **మహాత్మా** అని అందరిచేత పిలువబడిన గాంధీని ఆనాడు కాల్చి చంపిన వారు మతరక్షకులా? ఈనాడు నాలాంటి అమాయకులైన ఎందరో ప్రజలను దాడులకు గురి చేయించిన వీరా, హిందూమత రక్షకులు? ఉన్నతమైన

ధర్మాలకు నిలయమైన హిందూ మతములో ధర్మములేవో తెలియక, దైవ జ్ఞానము అర్థముకాని స్థితిలో ఉండిన కొందరు హిందువులు, ఇతర మతములలోని జ్ఞానమునకు ఆకర్షితులై మతమును మార్చుకొన్నారు. వారు అలా మారుటకు ముఖ్యకారణము ఏమి? అని చూడకుండా మన మతములో జ్ఞానము తెలియనప్పుడు ప్రక్క మతములోని జ్ఞాన ప్రచారమునకు మనవారు ఆకర్షితులైనారని ఏమాత్రమూ తెలియక, ఇతర మతస్తులను ద్వేషించడము వలన, హిందూమతము అభివృద్ధి కాకుండా క్షీణించి పోయే ప్రమాదము కలదని ఈ సంస్థలు గ్రహించడము లేదు. అటువంటి ప్రమాదమును గ్రహించిన కొందరు స్వామీజీలు, హిందూ మతములోని సూత్రములను బోధిస్తుంటే, హిందూధర్మములేవో తెలియకనే హిందూ సంస్థలుగా పేరు పెట్టుకొన్న వారు హిందూ ధర్మములనే గుర్తించలేని గ్రుడ్డివారై, స్వచ్ఛమైన హిందూ గురువులను కూడా పరమతస్తులుగా భావించి, వారిమీద కూడా దాడి చేయుచున్నారు.

'ఇందు' అంటే పరమతమనీ, స్వచ్ఛమయిన ఇందువును చంపిన వారు, హిందూ గురువుల మీదే దాడిచేసిన వారు, అమాయక హిందువులు దాడులకు గురి అగుటకు కారకులైన వారు, సామాజిక న్యాయమును చెప్పిన, పేరుగాంచిన ఒక హిందూ దర్శకుని మీదే ధర్నాలు చేసి, క్షమాపణ చెప్పమనిన వారు, దేశమునుండే వెలివేస్తామని చెప్పువారు వాస్తవానికి హిందువులేనా? అని ప్రశ్నించక తప్పదు.

ఈనాడు ఒక సినిమా ద్వారా మంచి సందేశమిచ్చిన ఒక బాధ్యతగల దర్శకుడు చేసిన తప్పేమిటి? ఒకచోట అన్నాచెల్లెలు కలిసి మాట్లాడినా మీరు ప్రేమికులే అని వారికి బలవంతముగా తాళి కట్టించడము హిందూ ధర్మములో కలదా? సమాజమునకు మంచి సందేశమిచ్చిన దర్శకుడు కృష్ణవంశీని ప్రజలు పొగడుచుంటే, వెలివేస్తామన్న వారికి గానీ, ఆ సంస్థ పెద్దలకుగానీ అసలు హిందూ ధర్మములు ఏమిటో తెలుసా? అని

ప్రశ్నిస్తున్నాము. ఈ మూర్ఖులతో ఎందుకులే అని చాలామంది హిందువులు ఈ విషయము మీద నోరు విప్పకున్నారు. కానీ అందరూ అలాగే ఉంటే హిందూమతము ఇంకా నాశనమై పోతుంది. కావున నేనొక హిందువుగా, హిందువుల కొరకు నోరు విప్పి చెప్పాలనిపించింది. 'హిందూ మతము' అను ముసుగు వేసుకొని, హిందూ రక్షణ సంస్థలుగా పేరు పెట్టుకొన్న మిమ్ములను హిందూ భక్షణ సంస్థలుగా హిందువులు భావిస్తున్నారు. అలా భావించడము వలననే మీరు రాజకీయములో ఎదుగుటకు ఏ హిందువూ ఇష్టపడడము లేదు.

హిందూ గ్రంథమైన భగవద్గీతలోని ధర్మములను తెలియకుండా, మీరు హిందువులమని చెప్పుకోవడమునకు అర్హులే కాదు! ఇలాగే అజ్ఞానముతో ప్రవర్తిస్తూ, హిందువులకే వ్యతిరేఖులుగా మారిపోతే హిందువులు కలిసికట్టుగా మీ ఉనికినే లేకుండా చేసే కాలమొస్తుందని ఒక హిందువుగా చెప్పుచున్నాను.

ఇప్పటికైనా గాంధీని చంపినందుకు భారతదేశమునకు క్షమాపణ మీడియా ద్వారా చెప్పండి. అమాయక ప్రజలను దాడులకు గురి చేసినందుకు ప్రజలకు, హిందూ గురువులనే అవమానించినందుకు హిందువులకు, సామాజిక న్యాయమును చెప్పిన హిందూ దర్శకున్ని వ్యతిరేఖించి బహిష్కరిస్తామన్నందుకు, మొత్తము హిందూ సమాజమునకు క్షమాపణ చెప్పండి! లేకుంటే మీ పాపములకు నిష్కృతి లేదు!!

ఇట్లు

**ఒక హిందువు**

తేదీ : అక్టోబర్ 2, 2009

శ్రీకాంత్ నటించిన **(మహాత్మ)** సినిమా విడుదలప్పుడు

డైరెక్టర్ కృష్ణవంశీ మీద దాడి గురించి ఒక హిందువు చెప్పిన విషయము.

25) ప్రశ్న :- హిందూ వాహిని, భజరంగదళ్, విశ్వహిందూ పరిషత్, ఆర్. యస్. యస్ (R.S.S), పరశురామ్ పరివార్, హిందూ జాగరణ సమితి (H.J.S), శివశక్తి, హిందూ యువశక్తి దళ్, హిందూ జనశక్తి, శివసేన, సమరసత సేవ ఫౌండేషన్, హిందూ ధర్మాచార్య ప్రతిష్టాన్, రాష్ట్రీయ హిందూ సేన, హిందూ ప్రస్థాక్, విశ్వ ధర్మ పరిరక్షణ, ప్రజా హిందూ దళము, హిందూ రక్షక దళ్ మరియు మొదలగు హైందవ ధార్మిక పరిరక్షణ సంస్థలకు మరియు రాముడిని ఆరాధ్య దైవముగా పూజించే ప్రతీ హైందవ సోదరులకు నా విన్నపము.

రామున్ని అధర్మపరునిగా చిత్రిస్తూ, లేని విషయాలను చొప్పిస్తూ, రాముని పై నిందలు వేస్తూ, భారతదేశ అంశములో ఉత్తరము, దక్షిణము అను వివక్ష రేపుతూ, యజ్ఞ యాగాది క్రతువులు వేస్ట్ యని బోధిస్తూ, భగవద్గీతను 17 అధ్యాయములకు కుదిస్తూ, సొంత భాష్యముతో గీతను అవమానిస్తూ, ఫెయిల్ అయిన ఆర్య ద్రావిడ సిద్ధాంతమును రుద్దుతూ, కార్తీకదీపాలు మూర్ఖత్వము అంటూ, రావణాసురుడు దేవుడు అని ప్రచారము చేస్తూ, సనాతన ధర్మమును అవమానిస్తూ త్రైత సిద్ధాంతమును ప్రచారము చేస్తున్న ప్రబోధానంద స్వామిని ఎదిరించండి అని కొందరు అన్నారు దీనికి మీరేమంటారు?

**జవాబు :-** ఇది పనీపాట లేకుండా బజారులో వృథాగా తిరిగే పదిమంది గుంపుగా యున్న అల్లరిమూక 'హిందూ రక్షకదళ్' అను పేరు పెట్టుకొన్న వారు ఫేస్‌బుక్‌లో పెట్టిన సమాచారము. ఇందులో ఎదుటి వ్యక్తిని అనగా మమ్ములను తప్పుగా చూపించు ఉద్దేశ్యముతో వ్రాసినది తప్ప వేరు ఏమీ లేదని చెప్పుచున్నాము. వీరు వ్రాసిన ప్రతీమాటకు సమాధానము ఇస్తున్నాము ఎవరిది తప్పో మీరే చూడండి!

ఇది వ్రాసినది పదిమంది యువకులకు నాయకుడుగా యుండి ఇలాంటి కార్యకలాపాలే పనిగా పెట్టుకొన్న ఒక వ్యక్తి. ఇతని పేరును నేను చెప్పదలచుకోలేదు గానీ, ఇతని ఆకారమును చెప్పితే భూమినుండి కొలిస్తే మూడు అడుగుల అంత పొడువు ఉంటాడు. అయినా ఆరు అడుగుల మనిషివలె మాట్లాడుతుంటాడు. వేషములో అప్పుడప్పుడు కాషాయము దుస్తులు ధరించి, విభూది ముఖాన దిద్దియుంటాడు. ఇతనిని చూస్తే జాలివేస్తుంది, చూడకపోతే కోపము వస్తుంది. ఇతడు ఆరు నెలల క్రితమే మా మీద కొన్ని ఆరోపణలతో ఫేస్‌బుక్‌లో ప్రచారము చేసి ఒక మధ్యవర్తి ద్వారా డబ్బును డిమాండ్ చేశాడు. మేము అప్పుడు పలుక లేదని మా శత్రువులుగా యున్నవారి చెంతకు చేరి, శత్రువులతో చేతులు కలిపి ఎనిమిది లక్షల డబ్బు తీసుకొని అప్పటినుండి ఇప్పటికి ఆరు నెలల కాలము నుండి ప్రతీ దినము ఏదో ఒక ఆరోపణ చేయడమే పనిగా పెట్టుకొన్నాడు. శత్రువులు ధనికులు, రాజకీయ బలమున్న వారు అయినందున వారితో మొదట కొంత మొత్తము డబ్బు తీసుకోవడమే కాక ప్రతీ నెల 28 వేలు జీతము తీసుకొంటూ, నన్ను విమర్శించడమే ఉద్యోగముగా పెట్టుకొని ప్రతి దినము అతను ఆరోపణలు చేయుచునే యున్నాడు.

అతని ఆరోపణలలో మేము 'రామున్ని అధర్మపరునిగా చిత్రిస్తున్నామని చెప్పి వ్రాశాడు. వ్రాయవలసిన పదమును కూడా సరిగా

వ్రాయలేనివాడు రామున్ని అధర్మపరుడుగా అని వ్రాశాడు. 'అధర్మ పరుడు' అంటే అధర్మములకు పరాయిగా యున్నవాడు అని అర్థము వచ్చును. దానిలో రాముడు ధర్మములు గలవాడనియే అర్థము వచ్చును. అతను వ్రాయవలసినది 'అధర్మవరుడు' అని అట్లు వ్రాస్తే రాముడు ధర్మములు లేనివాడు, ధర్మములు తెలియనివాడని అర్థము రాగలదు. నేను రామున్ని చెడుగా చెప్పుచూ అధర్మవరుడు అని చెప్పినట్లు వ్రాశాడు. నేను ఎప్పుడూ రాముని వ్యక్తిత్వమును గురించిన వివరమే చెప్పలేదు. అలాంటప్పుడు ఇది అసత్య ఆరోపణ తప్ప ఏమీ కాదని తెలియవలెను. నేను ఒక మాటను అడుగుచున్నాను. ఇవి అధర్మములు, ఇవి ధర్మములు అని మొదట నీకే తెలియదే, నేను రామున్ని గురించి అధర్మములు గలవాడని చెప్పినట్లు, ధర్మములు ఏవో తెలియని నీకు ఎలా తెలుసు?

'యజ్ఞములు వృథాయని' చెప్పినట్లు వ్రాశాడు. నేను చెప్పినది బయటి యజ్ఞముల వలన దేవుడు తెలియబడడు, లోపలి యజ్ఞములను చేయమని భగవద్గీతలోని మాటను చెప్పాను గానీ, యజ్ఞములే చేయకూడదు అని చెప్పలేదు. చేతనయితే శరీరము లోపలి యజ్ఞములు చేయమని చెప్పాను. "అధి యజ్ఞోఽహమే వాత్ర దేహే దేహ భృతాంవర" అను గీతా వాక్యమును అనుసరించి **"దేహములో జరుగు యజ్ఞము చేయమన్నాను."** అంతేకాక "శ్రేయాన్ ద్రవ్య మయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప॥" అను గీతా వాక్యము ప్రకారము **"బయట చేయు ద్రవ్యయజ్ఞములకంటే శరీరములో చేయు జ్ఞాన యజ్ఞము శ్రేష్టమని"** చెప్పాను. ఈ మాట నాది కాదు ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలోనిది. ఇందులో తప్పుపట్టితే "మీరు దేవున్నే తప్పు పట్టినట్లగును." ఎందుకనగా! బాహ్య యజ్ఞములు ద్రవ్యములతో చేయునవి యని భగవంతుడే భగవద్గీతలో చెప్పాడు. అంతేకాక **"బాహ్య యజ్ఞముల వలన దేవున్ని తెలియుటకు శక్యము కాదు"** అని

"న శక్యో" యని విశ్వరూప సందర్శన యోగము అను అధ్యాయములో 48, 53 శ్లోకములయందు చెప్పియున్నాడని తెలియగలిగితే నేను చెప్పినది సత్యమేయని తెలియగలదు.

భగవద్గీతను నేను **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** యను పేరుతో వివరించి వ్రాశాము. నేడు నేను చెప్పిన త్రైత సిద్ధాంత భగవద్గీత ప్రజలలో మంచి పేరు తెచ్చుకొన్నది. అంతేకాక రష్యా దేశములో భగవద్గీతను నిషేధించవలెనను వారి ఉద్దేశ్యమును మార్చి, ఇది ఉండవచ్చును అనునట్లు చేసినది త్రైత సిద్ధాంత భగవద్గీతయని, ఆ దేశము నుండి ఈ మధ్యనే మాకు సమాచారము అందినది. భారతదేశములో వివరము వ్రాయబడిన భగవద్గీతలు దాదాపు మూడువందల ముప్పది (330) ఉండగా, అందులో అన్నిటినీ అధిగమించి వివరమును చెప్పినది **త్రైత సిద్ధాంత భగవద్గీత** యని, ఎన్నో భగవద్గీతలు చదివినవారు తేల్చి చెప్పారు. దానిని అర్థము చేసుకోలేని పరిస్థితిలో లేక అదే పనిగా ఆరోపణ చేయవలెనను ఉద్దేశ్యముతో భగవద్గీతను వక్రీకరించి వ్రాశాడనడము తెలివి తక్కువ కాదా! ఎలుక సింహమును వెక్కిరించినట్లున్నది! నేను 'భగవద్గీతను పదిహేడు (17) అధ్యాయములకు కుదించాను' అని అన్నారు. నేను ఒక వ్యక్తిని గురించి అతను ధరించిన అంగీ వరకే చెప్పాను, లుంగీవరకు చెప్పలేదు. అంత మాత్రమున అతనికి క్రింద లుంగీ లేదని ఎందుకు అనుకోవాలి? అట్లే భగవద్గీతలో నేను వివరించి చెప్పినది 17 అధ్యాయములే, ఒక అధ్యాయము నకు వివరము చెప్పలేదు. అంతమాత్రమున భగవద్గీతలో ఒక అధ్యాయము లేదని నీవెందుకు అనుకోవాలి? అట్లు అనుకోవడము అంగీ ఉంది, లుంగీ లేదు అనుకొన్నట్లుంటుంది. సొంత భాష్యముతో గీతను అవమానిస్తూ వ్రాశారు అన్నారు. నేను ఎక్కడ వక్రీకరించి వ్రాశానో చూపగలరా? చాలామంది వ్రాసిన దానిలోని తప్పులు సరిదిద్ది చెప్పాము.

**"చాతుర్వర్ణము"** అను శ్లోకమునకు అందరూ కులములను అంటగట్టి వ్రాశారు. దేవుడు తన గ్రంథములో కులాలను, మతాలను గురించి ఎక్కడా చెప్పలేదు. అందువలన ఆ శ్లోకమునకు గుణములున్నట్లు చెప్పాము. అందరూ వ్రాసినది శాస్త్రబద్ధముగా లేదని, దాని నిజ భావమును శాస్త్రీయముగా వ్రాశాను. అది అర్థము చేసుకొను శక్తిలేని మీరు గీతను వక్రీకరించి వ్రాశాడు అనడము బుద్ధి తక్కువ పనికాక ఏమగును! **గీత సర్వమానవులకు చెప్పినదిగానీ, కులాలకు, మతాలకు చెప్పినది కాదు.** భగవద్గీతలోనికి కులాలను తీసుకొచ్చినవారు సక్రమముగా వ్రాసినట్లా? యని నేను అడుగుచున్నాను.

**"ద్రావిడ బ్రాహ్మణ"** అను గ్రంథములో గత చరిత్రలో ఏమి జరిగిందో దానినే వ్రాశాము. దక్షిణ భారతదేశములోని గిరిజనులయిన ఆజానుబాహుడుగా, అందముగాయున్న ఆంజనేయున్ని కోతిగా చిత్రించిన ఆర్యులు తప్పు చేశారుయనీ, వివక్షతో అలా చిత్రించి చూపారు అని చెప్పాము. **మేము చెప్పినది యదార్థము.** ఆర్యులు దక్షిణ దేశ గిరిజనులను వారి పని నిమిత్తము వాడుకొని, చివరకు గిరిజనులను కోతులుగా, ఎలుగు బంట్లుగా ఎందుకు చూపించారు? అని అడిగాము. అలా చూపడము ప్రాంతీయ వివక్ష కాదా! రాముని తరపున యుద్ధము చేసిన మనుషులు చివరకు జంతువులుగా కనిపించారా? యని అడిగాము. ఆనాడు నల్లమల అడవులలోని గిరిజనులు కోతులు, ఎలుగుబంట్లు అయితే రాముని తరపున యుద్ధము ఎలా చేశారని అడిగాము? చివరకు సహాయము చేసిన ఆంజనేయున్ని మనిషి ఆకారము నుండి కోతి ఆకారముగా మార్చి రాముని కాళ్ల దగ్గర చూపడము తప్పుకాదా? యని అడిగాము. జరగని చరిత్రను జరిగినట్లు చూపి వ్రాయడము, దక్షిణ దేశ రాజు అయిన రావణబ్రహ్మను

